# రాగ మాలిక

## జ్ఞానామృతము

సంకలనము

స్ఫూర్తి సిండికేట్



SPURTHI SYNDICATE

ఋషి సంస్కృతి విద్యాకేంద్రము తరపున

ప్రకాశకులు .

**స్ఫూర్తి సిండికేట్**

ఇ.నెం 2-10-1078, జ్యోతినగర్, కరీంనగర్.

**రాగమాలిక**

జ్ఞానామృతము

ప్రథమ ముద్రణ : 1996

ద్వితీయ ముద్రణ : 1997

వెల : 45/-

పుస్తకములు కావలసిన వారు
సంప్రదించవలసిన చిరునామా ·

**స్ఫూర్తి సిండికేట్**

ఇ.నెం. 2-10-1078, జ్యోతినగర్,
కరీంనగర్ - 505 002. ఫోన్ · 41435

---

కంప్యూటర్ టైప్ సెట్టింగ్ మరియు ముద్రణ :
విజయ గ్రాఫిక్స్, తిలక్ రోడ్, కరీంనగర్ - **505 001.** ఫోన్ : **43852 పి.పి.**

# అంకితం

ఋషి సంస్కృతిని దశ దిశలా వ్యాపింపచేస్తూ

ఎందరో జీవితాలలో జ్ఞాన జ్యోతులను వెలిగిస్తున్న

పూజ్య గురుదేవులు

శ్రీ ఋషి ప్రభాకరుల దివ్యచరణారవిందములకు

మరియు

గురుసేవకై తమ జీవితాన్ని అంకితం చేసి

ఎందరికో స్ఫూర్తి దాయకులు నాయకులు అయిన

సాధకుల పాదపద్మములకు భక్తి ప్రపత్తులతో .....

-స్ఫూర్తి సిండికేట్

# విషయసూచిక

# పరిచయం

జ్ఞానము అనంతము. దానిని ఈ చిన్ని పుస్తక రూపములో మీకందించాలనే మా ఈ సంకల్పాన్ని స్వీకరించి ప్రోత్సహిస్తున్నందుకు మీకివే మా కృతజ్ఞతలు. సిద్ధ సమాధి యోగ (S.S.Y.) శిక్షణా కార్యక్రమములోని మాధుర్యాన్ని అనుభవించి జీవితమంతా ఆనంద మయం చేసుకోవాలనుకునే సాధనలో అడుగడుగునా మీ వెంట ఉండి స్ఫూర్తినిస్తూ ఉపయోగపడాలనే సదుద్దేశ్యముతో ఈ పుస్తకము రూపొందించబడినది. మనమంతా ఒకటే మన మందరము ఈ పుడమి తల్లి యొక్క బిడ్డలం. మన మార్గాలు, మన జీవన విధానాలు వేరైన మన అందరి హృదయాలలో ఆ భగవంతుని నామ స్మరణలో పొందే తన్మయత్వము ఒక్కటే. ఆ ఒక్కటే అనే భావన అందరిలో కలగటానికి అన్ని భక్తి గీతాలను ఇందులో పొందపరచడము జరిగింది. శారీరక, మానసిక ఆరోగ్యము పరిపూర్ణముగా ఉన్నప్పుడే భక్తి భావనలు చిగురించి రాణిస్తాయి. అందుకే సంపూర్ణ శారీరక, మానసిక ఆరోగ్యము కోసము సిద్ధ సమాధి యోగా కార్యక్రమాలలో మీరు పొందిన శిక్షణ వివరాలను కొన్నింటిని మీకు ఉపయుక్తంగా ఉంటాయని ఈ పుస్తకములో చేర్చడము జరిగింది. మీ సాధనకు ఉపయోగపడే ప్రాణాయామము, అమృతహార సేవనము ఇతర శిక్షణా కార్యక్రమాల వివరణను, మీరు సద్వినియోగ పరచుకొని మీ కుటుంబ సభ్యులంతా లబ్ది పొంది ఆనందముగా, హాయిగా, ఆరోగ్యముగా, సాధకులుగా వెలుగొంది విశ్వమంతయు ఒక సుందర నందన వనముగా తీర్చిదిద్దాలని ఆకాంక్షిస్తూ సదా మీ సేవలో

**స్ఫూ సిండికేట్**

కరీంనగర్.

స్ఫూర్తి సిండికేట్ (Spurthy Syndicate)

తమ జీవితాన్ని పూర్తిగా గురు సేవకై అంకితము గావించి తమ పూర్తి కాలాన్ని వెచ్చించి ఆనందిస్తున్న సాధకుల సత్సంగమే మీ స్ఫూర్తి సిండికేట్

ప్రజల మెప్పునకై పనులు చేయకు. దేవుడు మెచ్చిన చాలును.

--- చంద్రశేఖరేంద్రసరస్వతి.

## సూచన :

ఈ పుస్తకములోని ప్రాణాయామము, యోగాసనాలు, సూర్య నమస్కారాలు మొదలగునవి కేవలము సిద్ధ సమాధి యోగ (S.S.Y ) తరగతులలో శిక్షణ పొందిన వారికి మాత్రమే ఉద్దేశించబడినది. ఈ పుస్తకము కేవలము (S S.Y ) చేసినవారికి రెఫరెన్స్‌గా ఉపయోగపడుననే సదుద్దేశముతో రూపొదించబడినదే తప్ప ఇతరులు ఈ పుస్తకము చూసి ఇందులోనివి నేర్చుకొనుట అపాయకరమని తెలియజేయుచున్నాము. కేవలము అనుభవజ్ఞులైన గురువుల సాంగత్యములో 18 రోజులు ఉండి శిక్షణ పొందిన వారి యోగక్షేమాలను అవసరములను దృష్టిలో ఉంచుకొని ఈ జ్ఞానామృతమును రూపొందించడమైనది కనుక (S S Y ) చేసిన ధ్యానులకు ఈ పుస్తకము అందించడమైనది.



అంతః కరణము పరిశుద్ధమైనపుడు పరమాత్మ గోచరించును.

--- ఆత్మానందభారతి

# ప్రార్థన :

హే భగవాన్ నాకు

బుద్ధుని హృదయము

శంకరా చార్యుని మేధస్సు

మహమ్మదు నిరాడంబరత

రామకృష్ణుని దైవానుభూతి

జోరాస్ట్రుని పవిత్రతను

వివేకానందుని నిర్భయత్వము

గురునానక్ గురుభక్తి

మహాత్ముని అహింస

యేసుక్రీస్తుని క్షమాగుణము

ఋషి ప్రభాకరుల ప్రేమగుణము

శివాజి యొక్క శూరత్వము

మదర్ థెరిసా సేవాభావమును

ప్రసాదించుము దేవా.

అంతాఒక్కటే. రెండనేది లేదనువారికి రాగద్వేషాలు లేవు.

--- చంద్రశేఖరేంద్రసరస్వతి.

# గీతా సారము

ఏమి జరిగిందో, అది బాగా జరిగింది.

ఏమి జరుగుతుందో, అది బాగా జరుగుతోంది.

ఏమి జరగబోతోందో, అదికూడా బాగానే జరగబోతోంది.

నీది ఏమి పోయింది, ఎందుకు నీవు ఏడుస్తున్నావు ?

నీవు ఏమి తెచ్చావని,

అది పోయిందని బాధపడుతున్నావు ?

నీవు ఏమి సృష్టించావని

అది నష్టపోయిందనడానికి ?

నీవు ఏమి యిచ్చావో, ఇక్కడే యిచ్చావు.

ఈ వేళ ఏది నీదో,

అది నిన్న ఎవరిదో ఈరోజు మరెవరిదో,

ఎల్లుండి ఎవరిదో అయిపోతుంది.

పరివర్తన సంసారం యొక్క నియమం.

# గురుపూజ

అపవిత్రః పవిత్రో వా, సర్వావస్థాం, గతోపివా

యస్మరేత్ పుండరీకాక్షం, స బాహ్యాబ్యంతరః శుచిః ॥

అందరిలో దేవున్ని, తనలో సర్వులను చూచువాడు ఉత్తమ భక్తుడు.

--- నారదానంద.

అవాహనం

నారాయణం పద్మభువం వశిష్టం, శక్తించ తత్పుత్ర పరాశరంచ
వ్యాసం శుకం గౌడపదం మహాంతం, గోవిందయోగీంద్ర మధాస్య శిష్యం
శ్రీ శంకరాచార్య మతాస్య పద్మ, పాదంచ హస్తామలకంచ శిష్యం
తంత్రోటకం వార్తికకార మన్యాన్, అస్మద్ గురూన్ సంతతమానతోస్మి ॥
శ్రుతిస్మృతి పురాణానాం, ఆలయం కరుణాలయమ్
నమామి భగవత్పాద, శంకరం లోకశంకరమ్
శంకరం శంకరాచార్యం, కేశవం బాదరాయణం
సూత్రభాష్యకృతౌ వందే, భగవంతౌ పునః పునః ॥
యద్ద్వారే నిఖిలా నిలింప పరిషత్, సిద్ధిం విధత్తే నిశం
శ్రీమత్ శ్రీలసితం జగద్గురుపదం, నత్వాత్మ తృప్తిం గత ః॥
లోకాజ్ఞాన పయోద, పాటనధురం, శ్రీ శంకరం శర్మదం
బ్రహ్మానంద సరస్వతీంచ, విశ్వేశ్వరం ధ్యాయామి జ్యోతిర్మయమ్.
ఆవాహనం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
ఆసనం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
స్నానం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
వస్త్రం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
చందనం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
అక్షతాన్ సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
పుష్పం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
ధూపం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
దీపం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
ఆచమనీయం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః

---

అందరు బ్రహ్మయోని సంభూతులే కావున సర్వులు సోదరులే

---వ్యాసుడు.

నైవేద్యం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
ఆచమనీయం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
తాంబూలం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః
శ్రీ ఫలం సమర్పయామి శ్రీ గురు చరణ కమలేభ్యో నమః

ఆరార్తికం

కర్పూర గౌరం కరునావతారం, సంసారసారం భుజగేంద్రహారం
సదా వసంతం హృదయారవిందే, భవం భవానీసహితం నమామి॥
ఆరార్తీక్యం సమర్పయామి శ్రీ గరుచరణ కమలేభ్యో నమః
ఆచమనీయం సమర్పయామి శ్రీ గురుచరణ కమలేభ్యో నమః

పుష్పాంజలి

గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుః, గురుర్దేవో మహేశ్వరః
గురు స్సాక్షాత్ పరంబ్రహ్మ, తస్మై శ్రీ గురవే నమః॥
అఖండ మండలాకారం, వ్యాప్తం యేన చరాచరం
తత్పదం దర్శితం యేన, తస్మై శ్రీ గురవే నమః ॥
బ్రహ్మానందం పరమ సుఖదం, కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగన సదృశం, తత్త్వమస్యాది లక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం, సర్వధీ సాక్షిభూతం
భావాతీతం త్రిగుణ రహితం, సద్గురుం తం నమామి॥
అజ్ఞాన తిమిరాంధస్య,జ్ఞానాంజన శలాకయా
చక్షురున్మీలితం యేన, తస్మై శ్రీ గురువే నమః
పుష్పాంజలిం సమర్పయామి శ్రీ గురుచరణ కమలేభ్యో నమః
ఓం పూజ్యాయ రాఘవేంద్రాయ సత్య ధర్మ వ్రతాయచ

ఆత్మ స్తుతి చేసుకొన్న, విన్న స్వనాశనం కోరుకొన్నట్లే
---యయాతి

భజతాం కల్ప వృక్షాయ నమతాం కామధేనవే. (2 సార్లు)

# అర్థము

1. అపవిత్రుడు గాని, పవిత్రుడుగాని ఎవరైతే అన్ని అవస్థలకు అతీతంగా ఉండి పుండరీకాక్షుని స్మరిస్తారో వారు బయట, లోపల పవిత్రు లగుదురు.

ఆవాహనం :- ఆత్మైక్య ఆహ్వానం

2. శ్రీమన్నారాయణ మూర్తి, పద్మము నుండి పుట్టిన బ్రహ్మ, వశిష్టుడు, శక్తి, మరియు వారి పుత్రుడు పరాశరుడు మరియు వ్యాసుడు, శుకుడు, మహాత్ముడయిన గౌడపాదుడు మరియు యోగీంద్రుడైన గోవిందుడు మరియు ఆయన శిష్యులు.

3. శ్రీ శంకరాచార్యులు మరియు వారి శిష్యులు అయిన పద్మపాద, హస్తామలక, త్రోటకాచార్యులు మరియు వార్తిక కారులు మొదలైన వారందరు గురువులను ఎల్లప్పుడు స్మరించెదను.

4. శృతి, స్మృతి పురాణాలకు ఆలయము, కరుణామూర్తి లోకమునకు మంగళ ప్రదుడును అయిన శంకర భగవత్పాదులకు నమస్కరించుచున్నాను.

5. శంకరుడే అయినటువంటి ఆ శంకరాచార్యునికి విష్ణువయినటువంటి వ్యాసునికి, సూత్రములకు భాష్యము వ్రాసినటువంటి భగవత్ స్వరూపులకు మళ్ళీ మళ్ళీ నమస్కరించుచున్నాను.

6. ఎవరి గుమ్మములో సకల దేవతాసమూహము సిద్ధి పొందుటకై పగలు, రాత్రి సమావేశమై ఉన్నారో అటువంటి మహాత్ములైన జగద్గురువుల పాదముల చెంత నా ఆత్మ తృప్తిని పొందుచున్నది.

7. లోకపు అజ్ఞానమనెడి మేఘములను పారద్రోలుటలో, నివారించుటలో ప్రతిభావంతులైన శ్రీ బ్రహ్మానంద సరస్వతి మొదలైన వారిని, జ్యోతిర్మయులైన

---

ప్రపంచమంతా నీదిగా చూసుకో ఇందు పరులెవ్వరునూ లేరు

---శారదా మాత

భగవాన్ విశ్వేశ్వరయ్యలను నేను మననము చేసికొనుచున్నాను.
ఆవాహనమును శ్రీ గురుచరణ కమలములకు నమస్కరించి సమర్పించుచున్నాను.
ఆసన స్నాన, వస్త్ర, చందన, అక్షతా, పుష్ప, ధూప,దీప, ఆచమనీయ, నైవేద్య, ఆచమనీయ తాంబూల, శ్రీఫల, ఆరతులను

కర్పూరము వంటి స్వచ్ఛమైన వాడు, కరుణామూర్తి, సంసారమునకు మూలతత్త్వము, నాగేంద్రుని హారముగా ధరించి ఎల్లప్పుడు మందహాసముతో ఉండు భవానీ సహితుడైన శివుడిని హృదయమనే కమలముతో నమస్కరించుచున్నాను. కర్పూర నీరాజనమును సమర్పించుచున్నాను.

ఆచమనీయమును సమర్పించుచున్నాను

పుష్పాంజలిః

బ్రహ్మానంద స్వరూపుడు, పరమ సుఖప్రదాత, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావము కల కేవల అద్వయమూర్తి జ్ఞాన మూర్తి, ప్రపంచమునకు అతీతమైన వాడు, ఆకాశమువలె సర్వవ్యాపకుడు, 'తత్త్వమసి' మొదలగు వేదాంత మహావాక్యములకు లక్ష్యార్థభూతుడు, ద్వితీయవస్తురహితుడు, నిత్యుడు, నిర్మలుడు, నిశ్చలుడు, సర్వప్రాణుల బుద్ధులకు సాక్షిభూతుడు, భావాతీతుడు, సత్వ రజస్తమోగుణ రహితుడును అయిన ఆ సద్గురు పాదారవిందములకు నమస్కరింతును

ఏ సద్గురువు యొక్క ప్రబావము వలన అజ్ఞానమనెడి రేచీకటి కలవాని నేత్రములు జ్ఞానమనెడు కాటుక పుడకలతో ఉన్మీలితములగునో - తెరచుకొనునో, జ్ఞానప్రకాశముతో ప్రకాశించునో బ్రహ్మశ్రీ సంపన్నులైన ఆ సద్గురు మూర్తికి శ్రద్ధాపూర్వకముగా నమోవాకములు సమర్పించుదును.

శ్రీ గురుదేవుల పాదపద్మములకు నమస్కారపూర్వకముగా పుష్పాంజలిని సమర్పించుచున్నాను.

---

ప్రపంచంలో ఏ వస్తువునందు సుఖ దుఃఖాలు లేవు ఉన్నచో అవి నీ మనో వికారాలే

---పరాశరుడు

# సూక్తి ముక్తావళి

**"నత్వ హంకామమే రాజ్యం న స్వర్గం నపునర్భవమ్ ।**
**కామయే దుఃఖ తప్తానాంప్రాణి నామూర్తినావనమ్" ॥** భాగవతం

నేను రాజ్యాన్ని కోరడంలేదు, శరీరమునకు సుఖాల్ని
జన్మరాహిత్యాన్ని కూడా కోరడంలేదు, నేను కోరేది
దుఃఖంతో తపించే ప్రాణులు ఆర్తిని బాధలను తొలగించాలని

**సహృదయం సాం మనస్య మనిద్వేషం కృణోమిన:**
**అన్యో అన్య మభిహర్యత వత్సం జాత మినా ఘ్న్య ॥** అధర్వ

మంచి హృదయం కలిగి మంచి మనస్సు కలిగి మానవులు
ఒకరి ఎడ ఒకరు ద్వేష భావం విడిచి వుండాలి
అప్పుడే పుట్టిన బిడ్డను గోవు ఆప్యాయతతో నాకుతూ
తన ప్రేమను వ్యక్తపరిచే విధంగా మానవులంతా
పరస్పరం ప్రేమ భావంతో ఉండాలి అంటుంది వేదము

**ఏష ఆదేశ: ఏష ఉపదేశ:**

స్త్రీ పురుషులు ధర్మబుద్ధి కలిగి మంచి నడవడిక కలిగి
సరైన స్వభావం కలిగి మహర్షుల్లా నిర్మలంగా ఉంటే
ప్రపంచమే సత్యలోకం అవుతుంది.
ధర్మజనితమైన గోసంతతి
వృద్ధిగా ఉన్నది. కావున ధర్మపథమున నడువవలెను.

**ఏకోపి గుణవాన్ పుత్రో నిర్గుణేన శతై రపి**
**ఏక: చంద్ర ప్రకాశేన నక్షత్రై: కిం ప్రయోజనమ్**

మంచి గుణములు కల కుమారుడు ఒక్కడైనను చాలు

---

అకాలమున ఎక్కువతిన్న తక్కువతిన్న విరుద్ధభోజనమే
--- చరకుడు.

వాని వలన కులము వంశం ప్రకాశిస్తుంది. హీనగుణములు
కలవారు నూఱుగురు పుట్టినను లాభము లేదు
లోకమంతయు ఒక్క చంద్రుని వలననే ప్రకాశవంతముగా
నున్నది కోట్ల కొలది నక్షత్రములున్నను అట్టి ప్రకాశము
లేదుకదా

**గీతే వాద్యే తథానృత్తే సంగ్రామే రిపుసంకటే**
**ఆహారే వ్యవహారేచ తక్త్వాలజ్జాం సుఖీభవేత్ ॥**

పాటలు పాడునప్పుడు వీణ మొదలగునవి వాయించునపుడు
నృత్యము చేయునప్పుడు యుద్ధం చేయునప్పుడు
భోజన సమయమందు వ్యవహార సందర్భమందును
సిగ్గు, మోహమాటం పనికిరాదు.

**పిబంతి నద్య స్స్వయమేనవాపః ఖాదంతి నస్వాదు**
**ఫలానివృక్షాః పయోధరాస్సస్య మదంతినైవ పరోప**
కారాయ సతాం విభూతయః

నదులు తమ నీరు తాము త్రాగవు వృక్షములు తమ
పండ్లు తామారగించవు మేఘములు పైరుల కొరకై
వర్షించును కాని వానిని భక్షింపవు. అట్లే సత్పురుషులు
తన ధనమును పరుల కొరకు ఉపయోగింతురు

**భూప్రదక్షిణ షట్కేన కాశీయాత్ర యుతేనచ**
**సేతుస్నాన శతైర్యశ్చ తత్ఫలం మాతృవందనే**

ఆరుసార్లు భూప్రదక్షిణ. పదివేల సార్లు కాశీయాత్ర
అనేక వేల సార్లు గంగా నది స్నానం చేసినందువల్ల
కలిగే పుణ్యము కన్నతల్లికి ఒక్కసారి నిర్మల

---

అడుగనిదే చెప్పకు అన్యాయముగా అడిగినా సవ్యముగా జవాబు ఇవ్వకు

--- మనువు.

హృదయంతో నమస్కరించినందువల్ల కల్గుతుంది.

## ధ్యానులు ఆచరించవలసిన దినచర్య

ఉదయము:- ఆసనాలు లేదా సూర్యనమస్కారములు, సోహమ్ ధ్యానము 45ని॥

ప్రాణాయామము అర్ధగంట

మధ్యాహ్నము:- సమాధి అభ్యాసము 15ని॥

సాయంత్రము:- సమాధి అభ్యాసము 15ని॥ ప్రాణాయామము. అర్ధగంట

వారములో 3 రోజులు ఆసనాలు

3 రోజులుసూర్యనమస్కారములు చేయవచ్చును.

## ప్రార్థనలు

ప్రాణాయామము చేయుటకు ముందు :-

ఓం.......ఓం......ఓం......(మూడుసార్లు)

1. గురుర్ బ్రహ్మ గురుర్ విష్ణుః గురుర్ దేవో మహేశ్వరః!
   గురు సాక్షాత్ పరం బ్రహ్మ తస్మైశ్రీ గురవే నమః

భావము:-గురువే బ్రహ్మ, గురువే విష్ణువు, గురువే సాక్షాత్ మహాశివుడు.
అటువంటి గురువే భావాతీత పరిపూర్ణతకు నిదర్శనమైన బ్రహ్మము
ఆ గురుదేవునకు నమస్కరించుచున్నాను.

2. అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం !
   తత్పదం దర్శితం యేన తస్మైశ్రీ గురవే నమః

భావము:-అనంతము, అపరిమితము, చరాచరములన్నింటియందు వ్యాపించి యున్నట్టి తత్వమును బహిర్గత మొనర్చుచున్న గురుదేవునకు నమస్కరించుచున్నాను.

---

అడుగులు చప్పుడు కాకుండా నడచుట వినయశీలం

ప్రాణాయామము తర్వాత:-

ఓం......ఓం......ఓం......(మూడుసార్లు) అసతోమా సద్గమయా

తమసోమా జ్యోతిర్గమయ మృత్యోర్మా అమృతంగమయ

ఓం......శాంతిః శాంతిః శాంతిః

భావము:-అసత్యము నుండి సత్యమునకు, చీకటి (అజ్ఞానం) నుండి వెలుతురు (జ్ఞానంనకు) మృత్యువు నుండి అమరత్వానికి పయనించెదను

భోజనమునకు ముందు.-

ఓం. ....ఓం..... ఓం(మూడుసార్లు) సహనా వవతు, సహనౌ భునక్తు

సహ వీర్యం కరవావహై తేజస్వీ నావధీతమస్తు మావిద్వి షావహై

ఓం శాంతిః శాంతిః శాంతిః

భావము:- అందరము సహ జీవనం చేయుదుము, కలసి ఆహారమును సేవించెదము, కలసియే శక్తిని సృష్టించెదము, మనలోమనకు సదవగాహన ఉండు గాక.

3. కాయేన వాచా మనసేంద్రియైర్వా, బుద్యాత్మనావా ప్రకృతేః స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై, నారాయనాయేతి సమర్పయామి ।

భావము:- శరీరం చేత, వాక్కు చేత, ఇంద్రియము వలన, బుద్ధితో, ఆత్మవలన, స్వాభావికమైన ప్రకృతి వలన, ఏదేది చేయుచున్నానో అదంతా నారాయణునికై సమర్పించుచున్నాను. ఇచ్చట ఆయా ఇంద్రియముల వలన చేసే మంచి పనులను మాత్రము పరిగ్రహింపవలయును.

4. సర్వేభవంతు సుఖినహః సర్వేసంతు నిరామయ
సర్వే భద్రాణి పష్యంతు మాకశ్చిద్ దుఖః భాగ్భవేత్ ।

అన్నిటియందు వుంటూ దేనిని అంటనివాడే జ్ఞాని

--- శ్రీ కృష్ణుడు

భావము:- సమస్త ప్రాణులు ఆనందంగా ఉండు గాక ఎల్లరు ఆరోగ్యముగా ఉండుగాక సమస్త జనుల మనసులో అందరి యోగ క్షేమములు ఉండుగాక, ఎవ్వరును ఏవిధంగాను దుఖః పడకుండ ఉండుగాక.

## గాయత్రీ మహా మంత్రము:

ఓమ్ భూర్భువఃస్వః తత్స వితుర్వ రేణ్యమ్ !
భర్గో దేవస్య, ధీమహి, ధియో యోనః ప్రచోదయాత్ ॥

**భావార్ధము:-** హేరక్షక సచ్చిదానంద స్వరూప జగదుత్పాదక దేవః నీదివ్యగుణ యుక్తము, వరేణ్యమునకు శుద్ధ విజ్ఞాన స్వరూపమును మేము నిత్యము మా హృదయమున ధ్యానింతుము, మాకు సద్బుద్ధినిచ్చి సత్కార్యము లాచరించునట్లు అనుగ్రహింపుము.

ప్రాణాయామము వాటి ప్రయోజనములు

ప్రాణాయామము ఒక క్రమ పద్ధతిలో శ్వాసను నియంత్రిస్తూ శ్వాసక్రియను జరుపుటను ప్రాణాయామము అందురు. ఇలా క్రమ పద్ధతిలో కాకుండా మామూలుగా శ్వాస క్రియ జరుగుట వలన మరియు శ్వాస నియంత్రణ లేకపోవడం వలన అధికముగా ప్రాణ శక్తి ఖర్చుఅవుతుంది. అందువలన మనిషి ఆయుష్కాలము తగ్గుతుంది. అదే ప్రాణాయామము చేయుటవలన మనిషి మనిషి సహజంగానే ఇంద్రియ నిగ్రహము కలిగి ప్రశాంతముగా రాగద్వేషాలకు అతీతంగా ఎదుగుతూ ప్రాణశక్తి వృదా చేసుకోకుండా ఎక్కువ కాలం జీవించగలుగుతారని నిస్సందేహముగా నిరూపించడమైనది.

---

అమితప్రసంగము చేయకు. ఆచి యాచి తూచి తూచి మాట్లాడుము

--- త్రైలింగస్వామి

ప్రాణాయామము చేయబడం ద్వారా శరీరం యొక్క ధృడత్వ పెరుగును. మానసికంగా భావోద్రేకాలను అధిగమించగలగడము ప్రజ్ఞామట్టము పెరిగి జరిగిన, జరుగుతున్న, జరుగబోయే వాటిని గ్రహించగలిగే శక్తి పెరుగుతుంది. సృజనాత్మకత పెరగడము జరుగుతుంది. అలాగే సంకల్పబలము అధికమవుతుంది. ప్రాణాయామము రక్త ప్రసరణమును క్రమబద్ధము చేయుటవలన జ్ఞాపక శక్తి పెరుగును మరియు నాడా వ్యవస్థకు పటుత్వమునిచ్చును నరాల బలహీనత అనే వ్యాదికి చిన్న, పెద్ద తారతమ్యము లేకుండా అందరూ గురి అవుతున్నారు. ఈ బలహీనత కేవలము మానసిక వ్యాదే దీనివలన గుండె జబ్బులు, అలసట పనిచేయలేకపోవుట కొద్దిగా పనిచేసిన అలసిపోవుట నిరాశ, భయము నిస్సత్తువలను తొలగించుకొనుటకు ప్రాణాయామమునకు మించిన సాధన మరొకటి లేదని మానసిక శాస్త్రమేత్తలు, వైద్యులు, యోగసాదకులు ఎన్నో పత్రికల ద్వారా మనకు తెలియ జేయుచున్నారు.

శరీర శక్తి కోసము వ్యాయమము కన్న ప్రాణాయామము రెండింతల వ్యాయామము కన్న అధిక శక్తిని ఇస్తుంది.

ఇటువంటి విశిష్టమైన ప్రాణాయామమును (S.S Y ) లో నేర్చుకొని లాభాలు పొందిన జ్ఞానుల అనుభవాలను విని ఇప్పుడు చాలామంది ప్రాణయామము నేర్చుకొనుటకు ఉత్సాహము చేపుతున్నారు. (S S Y ) శిక్షణలో ప్రాణాయామము నేర్చుకొన్న జ్ఞానులకు గుర్తుంచుకొనుటకు వీలుగా ఏముద్ర తరువాత జ్ఞాపకము తెచ్చుకొనుట కొరకు మాత్రమే బొమ్మల సహాయంతో ముద్రలను ఇవ్వడమైనది కాని మొత్తము ప్రాణాయామము నేర్చుకొనుటకు 15 రోజులు శిక్షణకు రావలయును.



**వజ్రాసనము :-** చేయు విధానము

1) కాలి బొటన వేళ్ళు జతలో ప్రక్కప్రక్కన ఉండాలి.

2) ఛాతి ముందుకు ఉండాలి.

3) వీపు నిటారుగా ఉంటుంది.

---

అవమానము కోరనిచో సన్మానము ఆశింపకుము

--- వినోభాభావే

4) భుజాలు వదులుగా, విశ్రాంతిగా ఉంటాయి.

5) మోకాళ్ళ చివర నాలుగు వేళ్ళ అంతరము ఉండాలి.

ఉపయోగాలు:- 1) కాళ్ళకు సంబంధించిన వ్యాధులు తగ్గిపోతాయి.

2) జీర్ణశక్తి అభివృద్ధి చెందును.

3) మనస్సు, శరీరానికి మధ్యలో సమన్వయము పెంచి నరాల పటుత్వము పెంచును.

## విభాగ ప్రాణాయామము

<u>కనిష్ఠ :</u>

1) చేతులు సమంగా ఉంచాలి నాలుగు వేళ్ళు జతలోఉండాలి.

2) చూపుడు, బొటన వేళ్ళను కలిపే గీత మాత్రమే శరీరానికి తాకుతూఉంటుంది.

3) హస్తాలు భూమికి సమాంతరముగా వుంచాలి.

4)చూపుడు, బొటన వేళ్ళను కలిపే గీత మధ్య బిందువు శరీరంపై సరిగ్గా ప్రక్కన తాకాలి.

5) చేతులు చివరి ప్రక్కటెముక క్రింద ఉంచండి.



6) మోచేతులు ముందుకు వెళ్లాలి.

అవివేకము, భద్రకము,జడత, మూఢత, కలవానికి జ్ఞానము కలుగదు.

---శంకరులు

ఉపయోగాలు :- ప్రాణశక్తి బొడ్డు నుండి పాదాల వరకు అందించబడును ఆయా భాగాలకు ప్రాణశక్తి అందించబడుట వలన అన్ని భాగాలు చైతన్యవంతముగా పనిచేయును.

<u>మధ్యమ విభాగ ప్రాణాయామము :-</u>

1) బొటన వేళ్ళు చంకల మధ్యలో వుంచాలి.

2) బొటన వేలు చూపుడు వేళ్ళ మధ్య గీత మాత్రమే శరీరానికి తాకుతూ ఉంటుంది

3) హస్తాలు సాధ్యమైనంత ఎదపై భాగములో వుంచాలి.



4) జబ్బలు భుజములతో సమానంగా ఉంచాలి.

5) చంకలో బొటన వ్రేలితో వత్తిడి కలిగించరాదు.

ఉపయోగాలు :- బొడ్డు పై నుండి గొంతు భాగమువరకు ప్రాణశక్తి అందించబడుట వలన ఆయా భాగాలకు చైతన్యవంతముగా పనిచేయును.

<u>జ్యేష్ఠ విభాగప్రాణాయామము :-</u>

1) మొదట ఎదను పూర్తిగా పైకి ఎత్తండి.

2) గడ్డాన్ని ఎదపైన తాకించండి.

---

పరబ్రహ్మమే నీవు, నేను, సర్వము అనే నిశ్చయ భావన కలిగియుండు

--- శంకరాచార్యులు

3) చేతులను వెనుకకు తిప్పండి. వెన్నుపైన సులభంగా ఉంచాలి.

4) తల క్రిందికి వంచి ఉంచండి. జబ్బలు చెవుల వెనుక తలను క్రిందకు పట్టి ఉంచుతుంది.



5) మరల ఒకసారి ఎదను పైకి పూర్తిగా ఎత్తాలి.

6) చివరగా మీ గడ్డం ఎదకు తాకి వుంచాలి. మీ ముఖం సాధ్యమైనంత నేరుగా ఉండాలి.

ఉపయోగాలు :- తల భాగమునకు ప్రాణశక్తి పంపించబడును.

ధౌతి : 17వ పేజిలోని విధముగా.

## ముద్రాప్రాణాయామము

<u>చిన్ముద్ర:-</u>

1) చూపుడు వ్రేలు మరియు బొటన వ్రేలు చివరలు ఒకదానికొకటి తాకుతూ ఉంటాయి.



2) వ్రేళ్ళ మధ్య వృత్తాకారంగా ఉండాలి. •

3) మిగిలిన మూడు వ్రేళ్ళు ఒకదానికొకటి తాకుతూ ఉంటాయి.

4) ముద్ర మాత్రము బిగుతుగా ఉంటుంది.

5) మోచేతులు నడుము భాగమునకు త్రాకాలి.

ఉపయోగాలు :- కనిష్టలో జరగే ఉపయోగాలే ఉంటాయి.

<u>చిన్మయముద్ర :-</u>



1) చూపుడు వ్రేలు బ్రొటన వ్రేలు యొక్క కొనలు మాత్రమే తాకుతూ వృత్తాకారంగా ఉండాలి.

2) మొదట వ్రేళ్ళను వాటి మూలల్లోకి మడిచి తరువాత

---

పతి శుశ్రూష వల్ల స్త్రీలకు ఉత్తమ లోకాలు ప్రాప్తించును.

--- వాల్మీకి.

అరచేతుల్లోకి మడచాలి.

ఉపయోగాలు :- మధ్యమలో జరిగే ఉపయోగాలు ఉంటాయి.

ఆదిముద్ర :-



1) బొటన వ్రేలును మడచి అరచేతిలో పెట్టవలెను.

2) మిగితా 4 వేళ్ళతో దాన్ని కప్పివేసి గుప్పిటగా చెయ్యాలి.

ఉపయోగాలు :- జ్యేష్ట ఉపయోగాలు దీనిలో కూడ జరుగును. విభాగ ప్రాణాయామము ద్వారా నాడులలోని మలినాలు బయటికి పంపించబడును. ముద్రా ప్రాణాయామము ద్వారా ప్రాణశక్తి సాఫీగా పంపించబడును.

మేరు దండ :-



1) వ్రేళ్ళ కొనలను వాటి మూల భాగాలలో ఉంచాలి.

2) తరువాత అరచేతులలోనికి మడవాలి.

3) బొటన వ్రేళ్ళు నిటారుగా ఉండాలి.

4) ముద్ర ను తొడ మధ్య భాగములో వుంచాలి.

5) మోచేతులు శరీరము ప్రక్క భాగానికి తాకాలి.

ఉపయోగాలు :- వెన్నుముకను చైతన్యవంతంగా చేయును.

పూర్ణముద్ర :-



1) పిడికిళ్ళు జతగా ఉంచాలి. ఉంగరాలు పెట్టుకొనే భాగము కలిపి ఉంచాలి.

2) చేతులను పొట్టకు ఆనించి తొడలపైన ఉంచాలి.

3) ఎదను లోపలికి అనుకొని మనికట్టును క్రిందికి నొక్కి

పదుగురుతోగాని ఒంటరిగా గాని కార్యాలోచన చేయకు.

--- వాల్మీకి.

భుజాలను పైకి ఎత్తి మోచేతులను ముందుకు

ఉపయోగాలు : శరీంలోని మొత్తం భాగాలకు ప్రాణ శక్తి వెళ్తుంది.

ధౌతి :- క్లాసులో నేర్పించిన విధముగా విభాగ ప్రాణాయామము తరువాత 3 సార్లు చేయాలి.

సుఖప్రాణాయామము :-

1) కుడిచెయ్యి మాత్రమే వాడాలి. ఎడమ చేయి మీ తొడల పైన ఉంచి అరచేయి ఆకాశము వైపు వుంచాలి.

2) బొటన వ్రేలును మరియు చిటికెన వ్రేలు మాత్రమే వాడాలి.



3) మిగితా వ్రేళ్ళు ఒక దానితో ఒకటి జతలో ఉండాలి.

4) కుడి ముక్కును బ్రొటన వేలుతో మూయండి.

5) ఎడమవైపు గుండా శ్వాసను వదిలేసి ఆదే ముక్కు ద్వారా గాలిని పీల్చాలి.

6) ఇప్పుడు ఎడమ ముక్కును చిటికెన వేలుతో మూసి కుడి ముక్కును తెరవండి.

7) కుడి ముక్కుద్వారా శ్వాస వదలండి. తరువాత అదే ముక్కు ద్వారా శ్వాస పీల్చాలి.

8) మళ్లీ కుడి ముక్కును మూసి ఎడమ ముక్కు ద్వారా గాలిని వదలి మళ్ళీ అదే ముక్కుద్వారా గాలిని పీల్చాలి.

ఉపయోగాలు :- మనస్సును శరీరాన్ని సమన్వయ పరచి ఎప్పుడుసమత్వంలో ఉంచుతుంది.

# ముద్ర ప్రాణాయామములో మార్పులు

శరీరములో ఏ భాగములో నైన నొప్పి ఉన్నప్పుడు

---

పదే, పదే శపధాలు పలికేవానికి వాక్శుద్ధి నశించును.

--- వేద వ్యాసుడు.

ఆ భాగాలకు అనువైన ముద్ర ఆ వైపు మాత్రమే ఉంచుకొని ఇంకొక వైపు విశ్రాంతిగా ఉంచుకొనవలెను.



నడుమునొప్పికి :- పూర్ణముద్రని బోర్లించి ఉంచాలి.



వీపునొప్పికి :- పూర్ణముద్రని వెల్లకిల ఉంచాలి.



కుడివైపు శరీరమంతటికి :-
పూర్ణముద్ర కుడివైపు ఎడుమచేయి మామూలుగా తొడలపైన ఆనించి వుంటుంది.



ఎడమవైపు గుండెకు, ఛాతికి :- చిన్మయముద్ర ఎడమవైపు.

పరదేశాన పడమర శిరస్సుగా బండుకోవలెను.

--- గార్గ్యుడు.

# యోగాసనాలు

1 టోనింగ్ :- శరీరములోని అన్ని భాగాలను నిదానముగా చేతితో మర్ధన చేసుకోవడమే టోనింగ్.

ఎన్నిసార్లు :- 2

వేయకూడని వారు :- అందరు దీనిని చేయవచ్చును

ఉపయోగాలు :- దీని వలన అన్ని ఉపయోగాలే

2 శవాసనము :- విశ్రాంతిగా వెల్లకిలా పడుకోవాలి. పాదాల మధ్య దూరము 1 అడుగు, అర చేతులు ఆకాశము వైపు చూస్తున్నట్లుగా ఉండాలి. శరీరములోని ప్రతిభాగము విశ్రాంతిగా ఉంటుంది. ఇలా పడుకున్నపుడు శ్వాసను గమనించాలి. విశ్రాంతిగా పడుకున్న తరువాత శరీరములో ఒక భాగము తరువాత ఇంకొక భాగమును విశ్రాంతి చేయాలి (కాళ్ళు, చేతులు, మొఖము, ఇలా 2 నిముషాలు చేయాలి.



వేయకూడని వారు :- అందరు దీనిని చేయవచ్చును.

ఉపయోగాలు :- మనస్సుకు, శరీరానికి విశ్రాంతి లభించును.

3 రాకింగ్ :- వెల్లకిల పడుకొని కాళ్లను మోకాలి దగ్గర మడిచి మోకాళ్ళు ఛాతికి తగిలేట్లు ఉంచాలి. మోకాళ్ళను చేతులతో పట్టుకోవాలి. శరీరాన్ని ముందుకు లేపుతూ మళ్ళీ పడుకుంటూ చేయాలి.

ఎన్నిసార్లు : 5 సార్లు చేయాలి.

---

పరద్రవ్యం ప్రతిగ్రహించే వానికి బ్రహ్మప్రాప్తి లేదు.

--- జమదగ్ని మహర్షి.

వేయకూడని వారు:- వృద్ధులు చేయరాదు. (60సం॥లు పైబడినవారు.)

4. రోలింగ్ :- వెల్లకిల పడుకొని కాళ్ళను మోకాలి దగ్గర మడచి మోకాళ్ళు ఛాతికి తగిలేటట్లు ఉంచాలి. మోకాళ్ళను చేతులతో పట్టుకొని ఎడమవైపుకు ఒకసారి తరువాత కుడివైపుకు ఒకసారి శరీరాన్ని ప్రక్కకు అనాలి. ఇలా 6 సార్లు చేయాలి.

వేయకూడని వారు:- స్పాండిలైటిస్, వెన్నునొప్పి ఉన్నవారు.

ఉపయోగాలు : జీర్ణ వ్యవస్థ చైతన్యవంతమగును.



5. సైక్లింగ్:- వెల్లకిల పడుకొని మోకాళ్ల దగ్గర మడచి గడియారపు దిశగా, గడియారపు వ్యతిరేక దిశగా సైక్లింగ్ చేయాలి. చేతులు మోకాళ్ళ పైన ఉంటాయి.

ఎన్నిసార్లు:- గడియారపు దిశగా 30 సార్లు
గడియారపు వ్యతిరేక దిశగా 30 సార్లు

వేయకూడనివారు:- అందరు చేయవచ్చును.

6. శవాసనము:- 2 నిమిషాలు.

7. అర్థ - పూర్ణ పశ్చిమోత్తాసన:- సుఖాసనములో కూర్చొని ఎడమకాలిని చాపిపెట్టి కుడికాలిని మడచి పాదము ఎడమకాలి తొడకు తాకేటట్లుగా పెట్టాలి. వెన్నెముక నిటారుగా, సౌకర్యముగా ఉండాలి. నిదానముగా వెన్నును వంచుతూ రెండుచేతులతో ఎడమకాలి బొటనవ్రేళ్ళును త్రాకాలి. తల మోకాలి చిప్పకు ఆనుతుంది. మోకాళ్లను వంచకూడదు. బొటన వ్రేలిని అందుకోనుటకు కష్టపడకూడదు. నిదానముగా చేస్తుంటే అదే అలవాటగును. ఆ తరువాత కుడికాలు చాచి ఒకసారి పై విధముగా చేయాలి.

---

పరమాత్మను భేదబుద్ధితో జూచువానికి ముక్తి లభింపదు.

--- వ్యాసుడు.

ఎన్నిసార్లు:- ఎడమకాలితో 2 సార్లు

కుడికాలితో 2 సార్లు

రెండుకాళ్లతో 2 సార్లు



వేయకూడని వారు:- వెన్నుపూస ప్రక్కకు తొలగినవారు, సయాటికా, అర్థరైటిస్ ఎక్కువ కాలము నుండి ఉన్నవారు, గూని ఉన్నవారు.

ఉపయోగాలు:- సీట్ భాగములోని నరాలను వదులుగా ఉంచును, తొడలు, పొట్ట భాగములో పేరుకుపోయిన క్రొవ్వును కరిగించును. డయాబెటీస్ తగ్గించును, స్త్రీల లైంగిక సమస్యలు నివారించును, వెన్నెముకకు సరియైన రక్త ప్రసరణ కలిగించును, ఆధ్యాత్మికత అనే ప్రజ్ఞను పెంచును.

8. శవాసనము:- 2 నిమిషాలు

9. సర్వాంగాసనము:- వెల్లకిలా పడుకొని ఆ తరువాత సీటును అర చేతులతో పట్టుకొని నిదానముగా మొత్తము కాళ్ళను పైకి లేపాలి వీపు, తల భాగమే నేలకు ఆని ఉండును. కాళ్ళు పైకి లేచినప్పుడు రెండు జతలో ఉండాలి.



ఎన్ని సార్లు:- ఒక్కసారి కాళ్ళు పైకి లేచిన తరువాత
మీకు సౌకర్యంగా ఉన్నంత సేపు
కాళ్ళను ఆలాగే కాసేపు అక్కడే ఉంచాలి.

వేయకూడని వారు:- థైరాయిడ్, సమస్య ఉన్నవారు, కాలేయము, స్ప్లీన్ వాపు వచ్చినవారు,గుండెపోటు(Hart Attack) బి.పి. ఉన్నవారు, వెన్ను నొప్పి ఉన్నవారు.

ఉపయోగాలు:- రక్త ప్రసరణ, జీర్ణ వ్యవస్థ, ప్రత్యుత్పత్తి, నాడీ వ్యవస్థ, గ్రంధి వ్యవస్థను సమత్వములో ఉంచును. రక్తమును మెదడుకు సక్రమముగా అందించడము ద్వారా శరీర పెరుగుదలను క్రమబద్ధీకరణము చేయును ఆస్త్మామా, బ్రాంకైటీస్

పరమాత్ముని ప్రసన్నత వలన లోక సౌభాగ్యం చేకూరును.

--- కుచేలుడు.

బోదకాలుకు ఉపశమనము కలిగించును. వెన్నుపూసకు, కాళ్ళకు, ప్రత్యుత్పత్తి భాగాలకు, పొట్ట భాగాలకు బలము చేకూర్చును.

సర్వాంగాసనములో మార్పులు :-

ఎ. సైక్లింగ్ చేయాలి 5 సార్లు

బి. వాకింగ్ చేయాలి 5 సార్లు

సి. కత్తెర చేయాలి 5 సార్లు

డి. పద్మాసనము వేయాలి 1 సారి వేసి అలాగే కాసేపు ఉండాలి.

<u>10. హలాసనము:-</u> సర్వాంగాసనములో కాళ్ళు పూర్తిగా పైకెత్తిన తరువాత నిదానముగా కాళ్ళను తల దగ్గర భూమిపైకి ఆనిస్తూ పొట్టను, సీటును వెనుకకు వంచుతూ బొటన వ్రేళ్ళతో భూమిని తాకాలి.

ఎన్నిసార్లు:- 1 సారి హలాసనములో ఉన్న తరువాత 30 సెకన్ల పాటు అదే స్థానములో ఉండాలి.



ఉపయోగాలు:- మూత్రపిండాలకు, కాలేయమునకు, పాంక్రియాస్‌ను సక్రమముగా పని చేయునట్లు తోడ్పడుతుంది. జీర్ణశక్తిని పెంచి మలబద్ధకాన్ని తొలగించును. పొత్తికడుపులోని క్రొవ్వును కరిగించును, డయబెటిస్‌కు పైల్స్‌కు ఉపశమనము కలిగిస్తుంది.

<u>11. మకరాసనము:-</u> బోర్లా పడుకుని తలను కుడివైపుకు త్రిప్పి తలక్రింద రెండు చేతులను ఉంచి కుడికాలిని మోకాలి దగ్గర విశ్రాంతిగా మడిచి ఎడమకాలును అలాగే చాపినట్లుగా ఉంచాలి. ఇలా ఒక నిమిషము ఉన్న తరువాత ఎడమ వైపు కూడ ఇలాగే చేయాలి.

ఎన్ని సార్లు:- 2 నిమిషాలు



---

పరముపై లక్ష్య ముంచుము - ఇహమును జూడకుము.

--- వసిష్ఠ మహర్షి.

ఎవరు చేయకూడదు:- ఎవ్వరైనా చేయవచ్చును.

ఉపయోగాలు:- మలబద్ధకాన్ని తగ్గించును, సయాటికా ఉన్నవారికి ఉపశమనము కలిగించును. మానసిక, శారీరక విశ్రాంతిని కలిగించే అత్యుత్తమమైన ఆసనము.

12. భుజంగాసనము:- బోర్లాపడుకుని అరచేతులు చాతి ప్రక్కన భూమికి ఆనించి ఉంచి నిదానముగా బొడ్డు పై శరీరభాగమంత పాము పడగలాగా సాధ్యమైనంత పైకి లేస్తుంది. ఆ తరువాత చూపు ఆకాశము వైపు చూస్తున్నట్లుగా ఉండును.



ఎన్నిసార్లు: 3 సార్లు చేయాలి

వేయకూడనివారు:-

పెప్టిక్ అల్సర్, హెర్నియా,

జీర్ణాశయపు టి.బి., గుండె బలహీనత ఉన్నవారు.

ఉపయోగాలు:- స్త్రీలకు సంబంధించిన లైంగిక సమస్యలు ఉండవు. మలబద్ధకము తగ్గించును. కాలేయమునకు, మూత్రపిండాలకు చాల మంచిది. వెన్ను పూస disc తప్పిఉంటే దానిని యధాస్థానములోనికి తెచ్చును. వెన్ను, వీపు నొప్పులను తగ్గించి ఆరోగ్యము చేకూర్చును.

మకరాసనము:- 2 నిమిషాలు

13. శలభాసనము:- బోర్లా పడుకుని చేతులను తొడల క్రింద ఉంచాలి. తలను కుడివైపుకు త్రిప్పి నిదానముగా కుడి కాలును మోకాలి దగ్గర మడవక ఎంత సాధ్యమెతే అంత కాలిని పైకి లేపాలి. అలాగే ఎడమకాలితో కూడా చేయాలి. ఆ తరువాత రెండు కాళ్లతో ఒకేసారి చేయాలి.



ఎన్నిసార్లు:- కుడివైపుకు 2 సార్లు
ఎడమవైపుకు 2 సార్లు

---

పరమేశ్వర పాలితమైన ఈ జగత్తు పవిత్రం, మంగళమయం.

--- వేదవ్యాసుడు.

రెండు కాళ్ళతో 2 సార్లు

ఎవరు చేయకూడదు:- పెప్టిక్ అల్సర్, హెర్నియా జీర్ణాశయపు T.B., గుండె బలహీనులు చేయరాదు.

ఉపయోగాలు: వెన్నెముక క్రింది భాగమునకు ఆరోగ్యము నిచ్చును. గుండెకు చాలా మంచిది, సయాటికాకు ఉపశమన మిచ్చును.

మకరాసనము:- రెండు నిమిషాలు

<u>14. ధనురాసనము:-</u>



బోర్లాపడుకుని నెమ్మదిగా కాళ్ళను పైకెత్తి చీల మండలాలను చేతులతో పట్టుకొని తల ఛాతి, సీటు, కాళ్ళను పైకెత్తాలి, పొట్ట మాత్రమే నేలకు ఆనుతుంది.

ఎన్ని సార్లు:- 3 సార్లు

ఎవరు చేయకూడదు:- పెప్టిక్ అల్సర్, జీర్ణాశయపు T.B. కడుపుతో ఉన్నవాళ్ళు చేయవద్దు.

ఉపయోగాలు:- Gastric Trouble తొలగించును, మలబద్ధకము తొలగించును, పొట్ట, సీటు, కాళ్ళ భాగములోని క్రొవ్వు త్వరితముగా తీసివేయును.

మకరాసనము:- 2 నిమిషాలు



<u>15. వక్రాసనము:-</u> సుఖాసనములో కూర్చుని కుడికాలును తీసి ఎడమ తొడ ప్రక్కన పాదము నేలపై పెట్టుకొని ఎడమ చేయి అరచేయితో కుడికాలు చీలమండలము తాకాలి, కుడి చేయి నడుముపైన ఆనివుంటుంది. తల వెనక్కి చూస్తుంటుంది

పరస్త్రీ ఎదురగునపుడు క్రిందు జూచుచూ నడువుము.

--- సరోజబాల.

ఇలా ఎడమవైపు కూడా పైన చెప్పిన విధముగా చేయాలి.

ఎన్ని సార్లు:- కుడివైపు 2 సార్లు, ఎడమవైపు 2 సార్లు

ఎవరు చేయకూడదు:- ఎవ్వరైనా చేయవచ్చును

ఉపయోగాలు:- వెన్నెముకకు, నడుము కండరాలకు చాలా మంచిది, జీర్ణశక్తిని పెంచును. ఎడ్రినల్ గ్రంథులు సక్రమముగా పని చేయునట్లు తోడ్పడును. షుగర్ వ్యాధిని తగ్గించును. నడుము వీపు భాగములోని నాడులన్నింటికి చాలా మంచిది. నాడీ వ్యవస్థలోని 72,000 ప్రాణ నాడులను ఉత్తేజముగా పనిచేయుటకు ఉపకరించును

మకరాసనము:- 2 నిమిషాలు



16. మహాముద్ర:- సుఖాసనముతో గాని, అర్థ పద్మాసనములో గాని, పద్మాసనములో గాని కూర్చుని చేతులు రెండింటిని వెనుక నడుము దగ్గర ఉంచి తలను నిదానముగా ముందుకు తీసుకొచ్చి మాడను భూమికి ఆనించాలి.

ఎన్ని సార్లు:- 3 సార్లు

ఎవరు చేయకూడదు:- గర్భిణి స్త్రీలు

ఉపయోగాలు:- పొట్టలోని కండరాలకు, వెన్నుపూసకు ఆరోగ్యము చేకూరుతుంది, ఛాతి అభివృద్ధి చెందని పిల్లల్లో పెరుగుదలను ప్రోత్సహిస్తుంది.

17. తాడాసనము:- నిలబడి రెండు చేతులను Cross చేస్తున్నట్లుగా చేతులు ఆకాశమువైపు చూస్తునట్లుగా చేతులను పైకి ఎత్తి పెట్టాలి. తరువాత కాలి మునివ్రేళ్ళతో పైకి లేస్తు శరీరాన్ని ఎవరో పట్టి పైకి లాగుతున్నట్లుగా శరీరాన్ని పైకి లాగుతున్నట్లు చేయాలి.

ఎన్ని సార్లు:- 3 సార్లు

---

పరస్త్రీ మొగముపై రెండవసారి కన్నెత్తి చూడకుము.

--- దయానంద సరస్వతి.

ఉపయోగాలు:- వెన్నెముకకు చాలా మంచిది,
నాడీ వ్యవస్థను సక్రమముగా ఉంచును.
ఎవరు వేయకూడదు : అందరు వేయవచ్చును

18. పాద హస్తాసనము:- తాడాసనము నుండి ఒక్కొక్క అంగుళము ముందుకు నెమ్మదిగా వంగుతూ చేతులను నేలకు ఆనించాలి. రెండు మూడు సార్లు శ్వాస తీసుకుని వదిలాక తరువాత ఇంకా కొంత ముందుకు వంగాలి. శరీరము ఏ విధముగా ముందుకు వంగాలంటే కండరాలే లేనట్లుగా విశ్రాంతిగా వంగాలి చేతులు భుజాలు వదులుగా ఉండాలి నిదానముగా పైకి రావాలి. చేతులు వదులుగా ముందుకు ఉంటాయి.



ఎన్ని సార్లు:- 2 సార్లు
ఎవరు చేయకూడదు :
వెన్నెముక నొప్పి ఎక్కువగా ఉన్నవారు చేయకూడదు.
ఉపయోగాలు :- వెన్నెముక ఆరోగ్యముగా ఉండును. మలినాలను తొలగించి శరీరాన్ని శుద్ధి చేయును. వ్యాధి నిరోధక శక్తిని పెంచును.
భ్రమరి:- వజ్రాసనములో కూర్చొని శ్వాసను పీల్చుకొని ఉమ్ అనే శబ్దము చేస్తూ శ్వాసను బయటికి వదలాలి చేతి వ్రేలితో చెవులను మూయాలి.

పిదార్థ మెవరికి స్వార్థమో వారు పురుష ఆ:
--- భర్తృహరి.

ఎన్ని సార్లు:- 5 సార్లు

ఎవరు చేయకూడదు:- ఎవ్వరైన చేయవచ్చును.

ఉపయోగాలు:- శరీరానికి మనస్సుకు విశ్రాంతి ఇచ్చును.



## : కొన్ని నియమాలు :

1. వారానికి 4 సార్లు యోగాసనములు వేయాలి.

2. ప్రొద్దున వేయునపుడు ప్రాణాయామానికి ముందు సాయంత్రము అయితే ధ్యానము ప్రాణాయామ తర్వాత ఉదయము అయితే సూర్యోదయానికి ముందు సాయంత్రమైతే సూర్యాస్తమయము తర్వాత.

3. ఆహారము తీసుకొనుటకు ముందు యోగాసనాలు వేయవద్దు.

4. పరుపుపైన పడుకొని యోగాసనాలు వేయవద్దు కార్పెట్ గాని రగ్గుగాని వేసుకొని చేయాలి.

5. పూర్తిగా మౌనంగా ఉండి చేయాలి.

6. యోగాసనము ఒకదాని తరువాత ఒకటి వెంట వెంటనే వేయక శవాసనములో విశ్రాంతి పొందాలి. ఆసనాలు పూర్తిగా అయిపోయిన తరువాత కూడ శవాసనములో విశ్రాంతిగా ఉండాలి.

7. ఆసనాలు నిదానముగా వేయాలి శరీరాన్ని శ్రమ పెట్టుకోవద్దు.

8. పీరియడ్స్‌లో ఉన్నప్పుడు స్త్రీలు వేయవద్దు, 4వ నెల ప్రారంభమయిన నాటి నుండి గర్భిణి స్త్రీలు వేయవద్దు.

9. ఎండాకాలములో తగ్గించి చలికాలములో ఆసనాలు వేసే సంఖ్యను పెంచాలి.

10. స్నానము చేసిన తర్వాతగాని చేయక ముందుగాని వేయవచ్చును.

11. వదులు దుస్తులు ధరించాలి.

12. శ్వాస ముక్కు ద్వారా వదలాలి. బిగపట్టవద్దు.

---

పరిసరములలోనున్న ప్రతి వస్తువులోను దేవుని చూడడం నేర్చుకో.

---శారదామాత.

13. కాలకృత్యాల తర్వాత చేయాలి, కాని మలబద్ధకముతో బాధపడేవాళ్లు ముందు  కూడ చేసుకొనవచ్చును.

# సూర్య నమస్కారములు.

సూర్యనమస్కారములు ఒక అద్భుతమైన ఎక్సరుసైజు. ఇవి శరీరములోని కండరాలను, జాయింట్లను, అంతరంగిక అవయవములను విరామముగా, వదులుగా ఉంచుతుంది.

వీటిని ఉదయం కాలకృత్యము అయిన తరువాత చేసుకుంటే చాలా మంచిది. ఉత్తమమైన సమయము సూర్యోదయానికి కొద్దిగా ముందు అలాగే రోజు మొత్తంలో ఎప్పుడైనా శారీరకంగా గాని మానసికంగా గాని అలసిపోయినప్పుడు ఈ సూర్య నమస్కారాలు చేసుకోవటం వలన శక్తివంతంగా కావచ్చును.

సూర్యనమస్కారములో మొదటిస్థితి సావధానంగా ఉండటము ఆ తరువాత 12 క్రమాలు 12 రాశులలో ఉంటాయి.

ఒక పూర్తి సూర్యనమస్కారములో 12స్థితులు ఉంటాయి. ఇలాంటివి 12 చేస్తాము. ప్రతి సూర్యనమస్కారమునకు ఒక మంత్రము ఉంటుంది. పూర్తి ప్రయోజనాల కొరకు ఈ మంత్రాన్ని పైకి ఉచ్చారణ చేయాలి.

## మొదటిస్థితి : నమస్కారము


ప్రణామాసనం
మొదటి స్థితి

కాళ్ళు దగ్గరగా పెట్టుకొని నిటారుగా నిలబడాలి. పాదాలు, మోకాళ్ళు ఒకదాని ప్రక్కన ఒక్కటి ఉండాలి. ఛాతిముందు రెండు చేతులతో నమస్కారము చేసుకోవాలి.

ప్రయోజనాలు : ఒక విధమైన ఏకాగ్రతని ఇస్తుంది. ముందు ముందు చేయబోవు స్థితులకోసము శరీరాన్ని తయారుగా ఉంచుతుంది. నెమ్మదిగా శ్వాసతీసుకుంటూ పటములో

---

పరీక్షకై ఎన్ని కష్టాలెదురైనా దేవుని నమ్మియుండు.

--- లీలాశుకులు.

చూపిన విధముగా రెండు చేతుల మధ్య రెండు అడుగుల దూరము ఉంచి వంగాలి.

రెండవ స్థితి : నెమ్మదిగా శ్వాస తీసుకుంటూ పటములో చూపిన విధముగా రెండు చేతుల మధ్య రెండు అడుగుల దూరము ఉంచి శరీరాన్ని కష్టపెట్టకుండా సాధ్యమైనంత వరకు వెనుకకు వంగాలి.



హస్త ఉత్తనాసన
రెండవ స్థితి

ప్రయోజనాలు : పొట్టలోని కండరాలను సాగించటము వలన ఎక్కువగా ఉన్న కొవ్వు తగ్గించడంతోపాటు జీర్ణశక్తి మెరుగవుతుంది. వెన్నులోని నరాలను, చేతులను, భుజాలను బలపరుస్తుంది. ఊపిరితిత్తులలోని గదులను విశాలపరుస్తుంది.

మూడవస్థితి : అరచేతులను పాదాల ముందు గాని ప్రక్కలకు కాని తాకేలా పూర్తిగా ముందుకు వంగాలి వంగేటప్పుడు శ్వాసవదులుతూ వంగాలి. వీలయితే తలను మోకాళ్ళకు ఆనించాలి. కాని అందుకోసము శ్రమపడకూడదు. కాళ్ళు మోకాళ్ల దగ్గర వంగకూడదు.



పాద హస్తాసన
మూడవ స్థితి

ప్రయోజనాలు : కడుపుకు సంబంధించిన వ్యాధులను గాని దూరము చేసుకోవటానికి బాగా ఉపయోగపడుతుంది. క్రొవ్వును తగ్గించి జీర్ణశక్తిని పెంచి మలబద్ధకమును దూరం చేస్తుంది. రక్త ప్రసరణ పెరిగి వెన్నులోని నరాలను పటుత్వంగా ఉంచుతుంది.

నాల్గవ స్థితి : ఎడమ కాలిపాదమును భూమిపై అలాగే ఆనించి ఉంచి కుడికాల్లిని పటంలో చూపిన విధముగా సాధ్యమైనంత వెనుకకు పోనివ్వాలి. మూడవస్థితిలో చేతులు పాదాల పక్కన ఎలా ఉంటాయో అవి అలాగే వుంటాయి.

---

పరుల ఆదర సమ్మానముల కాశింపకుము.

--- బొంతముంత స్వామి.

శరీరము యొక్క బరువు మొత్తము రెండు అరచేతులు, ఎడమపాదము, కుడికాలు, మోకాలు మరియు కుడికాళ్ల వేళ్లపై ఆధారపడి ఉంటుంది. తల వెనుకకు వాలేసి చూపు ఆకాశము వైపు నిలపాలి. ఈ విధముగా చేస్తున్నపుడు శ్వాస తీసుకుంటూ చేయాలి.



అశ్వ సంచాల నాసన
నాల్గవ స్థితి

ప్రయోజనాలు : కడుపులోని అవయవాలకు బలంగా చేకూరుతుంది. అవి పనిచేసే తీరు మెరుగవుతుంది. కాళ్లలోని కండరాలకు బలం చేకూరుతుంది. నరాలను సమత్వానికి తెస్తుంది.

అయిదవస్థితి : ఎడంకాలును తీసి ఇది వరకే వెనుకకు సాగిఉన్న కుడి కాలు పక్కన పెట్టాలి. పటములో చూపిన విధముగా పిరుదులను పైకి ఎత్తి తలను రెండు చేతుల మధ్య ఉంచాలి. చేతులు కాళ్లు-నేల ఈ మూడు త్రికోణములోని 3 రేఖలుగా ఉండాలి. సాధ్యమైనంత వరకు మడిమను నేలకు ఆనించి శ్వాస వదులుగా చేయాలి.



పర్వతాసన
ఐదవ స్థితి

ప్రయోజనాలు : కాళ్ళు, చేతుల కండరాలు బలపడుతాయి. స్వచ్ఛమైన రక్తం అంది వెన్నులోని నరాలు ఆరోగ్యంగా ఉంటాయి.

ఆరవ స్థితి : పటములో చూపిన విధముగా శరీరాన్ని భూమిపై ఆనించాలి. రెండు పాదాల వేళ్ళు, రెండు మోకాళ్లు ఛాతి రెండు చేతులు మరియు గడ్డము (ఈ విధముగా 8 అంగలు నేలకు తాకుతూ సాష్టాంగ నమస్కారము చేయాలి.) మాత్రమే నేలకు తాకుతాయి. ఈ స్థితిలో ఉన్నప్పుడు శ్వాస శూన్యకలో ఉండాలి. పొట్ట, సీటు భాగము, నేలపై ఉండి కొంచెము ఎత్తులో ఉంటాయి.

అష్టాంగ నమస్కార
ఆరవ స్థితి

---

పరులకు అపకృతి చేయనివాడు లోకో ప్రకృతి చేసినట్లే.

--- గౌతమబుద్ధుడు.

ప్రయోజనాలు : కాళ్ళు చేతులలోని కండరాలు బలపడుతాయి. ఛాతిని విశాలపరుస్తుంది.

ఏడవస్థితి : పటములోని విధముగా తొడలను, పొత్తికడుపును భూమిపై ఆనించి శరీరాన్ని నాభి వరకు పైకి లేపాలి. బరువు చేతుల పైనే ఉంటుంది. మోచేతుల వద్ద వంగకూడదు. శరీరాన్ని వెనుకకు వంచుతున్నపుడు శ్వాసతీసుకోవాలి.

భుజాంగాసనం
ఏడవ స్థితి

ప్రయోజనాలు : పొట్ట వెనుకకు నొక్కు కొనటము వలన ఆ ప్రాంతములో నిలువ ఉన్న రక్తము పైకి పీల్చబడుతుంది. అన్ని రకాల కడుపుకి సంబంధించిన సమస్యలకు చాలా ఉపయోగము వెన్నులోని నరాలు శక్తివంతముగా మారుతాయి. బుద్ధి వికాసము జరుగుతుంది.

ఎనిమిదవ స్థితి : అయిదవ స్థితిని మరల చేయటము

తొమ్మిదవ స్థితి : నాల్గవ స్థితినే చేయాలి కాని ఈ సారి కుడికాలి పాదము భూమికి ఆని ఉంటుంది. ఎడమకాలు వెనుకకు ఉంటుంది.



పర్వతాసనం
ఎనిమిదవ స్థితి

పదవ స్థితి : మూడవ స్థితిని మరల చేయటము.

పదకొండవస్థితి : రెండవ స్థితిని మరల చేయాలి.

పన్నెండవ స్థితి : మొదటిస్థితిని మరల చేయాలి.

సూర్యనమస్కారములు చాలా నిదానముగా విశ్రాంతిగా చేయాలి. ఈ స్థితులలో శరీరము సాగినప్పుడు శ్వాసను తీసుకుంటూ, కుంచిచు సమయాల్లో శ్వాస వదులుగా ఉండాలి. ప్రతిస్థితిలో శ్వాసను లోతుగా తీసుకుంటూ వదిలివేయాలి. నిదానముగా చేయుటము వలన ప్రాణాయామమునకు సమాధి అభ్యాసానికి ఉపయోగకారిగా ఉంటుంది.

---

పరుల దోషాలు వెతుకువాడు, వినువాడు ఉన్నత స్థితికి రాజాలడు.

--- శివానందుడు.

సూర్యనమస్కారములలో ఉపయోగించు మంత్రములు. ఈ మంత్రమును ఒక పూర్తి సూర్యనమస్కారమునకు ఒక్కటి చొప్పున గాని లేదా ప్రతి సూర్యనమస్కారములోని ప్రతిస్థితి ఒక మంత్రము చొప్పున వాడుకోవచ్చును.

మంత్రము వాని అర్థము :

1. ఓం మిత్రాయనమ : (అందరికి మిత్రుడైన నీకు వందనాలు)
2. ఓం రవయేనమః (ప్రకాశించు వానికి నమస్కారములు)
3. ఓం సూర్యాయనమః (సృష్టిలోని క్రియలను ప్రేరేపించు వానికి నమస్కారములు)
4. ఓం భానవే నమః (ఉదయించు వానికి వందనములు)
5. ఓం ఖగాయ నమః (ఆకాశములో వేగముగా పయనించు వానికి వందనములు)
6. ఓం పూష్ణేనమః (శక్తి ప్రదాతకు నమస్సులు)
7. ఓం హిరణ్య గర్భాయనమః (బంగారు వర్ణము గల వానికి వందనములు)
8. ఓం మారీచాయనమః (ఉదయ భగవానునికి నమస్కారములు)
9. ఓం ఆదిత్యాయనమః (అదితి తనయునికి నమస్కారములు)
10. ఓం సవిత్రేనమః (దయగల తల్లికి వందనములు)
11. ఓం అర్కాయనమః (స్తుతికి అర్హుడైన వారికి నమస్కారము)
12. ఓం భాస్కరాయ నమః (జ్ఞాన ప్రదాతకు వదంనాలు)

# అమృతాహారము

రోగం వచ్చిన తరువాత చికిత్స
ప్రాకులాడేకన్నా ఆరోగ్యాన్ని కాపాడుకోవడం వివేకవంతమైన
కార్యమని అందరకు తెలిసిన విషయమే.

---

పరుల యాన తలదాల్చువాడు ఆజ్ఞాపించుటకు అర్హుడే.

--- వివేకానంద.

అయినప్పటికి ఆరోగ్య రక్షణకై కావలసిన రక్షణ
నేటి సమాజములో లేకపోవడం శోచనీయం
ధర్మార్థ కామ మోక్షాణాం ఆరోగ్యం
మూలముత్తమమ్ అన్నారు.
ధర్మ, అర్ధ, కామ, మోక్షములనబడే చతుర్విధ
పురుషార్థాలను సాధించడానికి ఆరోగ్యం చాలా
అవసరం అయితే ఆరోగ్యం అంటే ఏమిటి ?
దానిని ఎలా కాపాడుకోవాలి అనే విషయాలను
గురించి ప్రతి ఒక్కరు తెలిసికోవాలి.
ఆరోగ్యం అనేది శారీరకంగానే కాక
మానసికంగా కూడా ఉండాలి. శారీరక మానసిక
ఆరోగ్యములున్నప్పుడే సంపూర్ణ ఆరోగ్యము అవుతుంది.
అటువంటి అమూల్యమైన ఆరోగ్యాన్ని మీకు అందించేది

## సాధన S.S.Y.

ఈ జీవిత కురుక్షేత్రంలో క్రుంగిపోతున్న
నరుణ్ణి వీపుతట్టి పూజ్య గురూజీ ఋషిప్రభాకర్ గారు
" నీ జీవితరథాన్ని కదిలించటానికి సాధన"
అనే అభయం హస్తం చూపారు
ఆ అభయ హస్తంలో అయిదు వ్రేళ్ళున్నాయి.
అవి సత్యం, ధర్మం, శాంతి, ప్రేమ, అహింసలు
ఇవన్ని కలిసినదే (S S.Y)
S.S.Y చేసిన మీకు ఆహారము, ఆరోగ్యము యొక్క ప్రాముఖ్యత తెలుసు
అందులో శాఖాహారము యొక్క విశిష్టత చాలా ఉంది.

---

పరులు తనకుకొద్దిగా మేలు చేసినా ఎక్కువగా జెప్పుకోవలెను.
--- శ్రీరాముడు.

| ఆహారము పేరు | మా.కృ | పిండి పదార్థాలు | క్రొవ్వులు | పీచు పదార్థాలు | ఖనిజాలు | కాలరీల శక్తి | ప్రతి 100 గ్రా॥ |
|---|---|---|---|---|---|---|---|
| బియ్యము | 13.5 | 48.4 | 16.2 | 4.3 | 6.6 | 393 | |
| మొక్కజొన్న | 11.1 | 66.2 | 3.6 | 2.7 | 1.5 | 342 | |
| గోధుమ | 12.1 | 69 4 | 1 7 | 1.9 | 2 7 | 341 | |
| సోమచిక్కుడు | 43.2 | 20.9 | 19.5 | 3.7 | 4.6 | 432 | |
| మినప పప్పు | 24.0 | 59.6 | 1.4 | .9 | 3 2 | 347 | |
| పెసర పప్పు | 24.0 | 56.7 | 1.3 | 4.1 | 3.5 | 334 | |
| కందులు | 22.3 | 57.6 | 1.7 | 1.5 | 3.5 | 335 | |
| వేరుశనగ | 26.2 | 26.7 | 39.8 | 3.1 | 2.5 | 570 | |
| జీడిపప్పు | 21 2 | 22.3 | 46.9 | 1.3 | 2.4 | 596 | |
| కిస్‌మిస్ | 1.8 | 74.6 | .3 | 1 1 | 2.0 | 308 | |
| పుచ్చకాయ | 34.1 | 4.5 | 52.6 | .8 | 3.7 | 628 | |
| కొబ్బరి | 6.8 | 18.4 | 62 3 | 6.6 | 1 6 | 662 | |
| అరటి | 1 2 | 27 2 | .3 | .4 | .8 | 116 | |
| ఆపిల్ | 2 | 13.4 | .4 | 1 0 | .3 | 59 | |
| ద్రాక్ష | 1 0 | 10 | .1 | 0.4 | 45 | 35 | |
| జామ | 0.9 | 11.3 | .3 | 5 2 | 0.7 | 51 | |
| బత్తాయి | 0.8 | 9.3 | 0.3 | 0 5 | 0.7 | 43 | |
| ఆరంజ్ | 0.7 | 10 9 | 0.2 | .3 | .3 | 48 | |
| పొప్పడి | 0 6 | 7.2 | 0.1 | 0 8 | .5 | 32 | |
| మామిడి | 0.6 | 16 9 | 0.4 | 0.7 | 0.4 | 74 | |
| పాలకూర | 2 0 | 2.9 | 0.7 | 0.6 | 0.7 | 26 | |
| కాబేజి | 1.8 | 4 67 | 0.1 | 1 6 | .6 | 27 | |
| కాలిఫ్లవర్ | 2.6 | 4 0 | .4 | 1 2 | 1.0 | 30 | |
| బెండ | 1.9 | 6.4 | 2 | 1.0 | .7 | 35 | |
| ఆలు | 1.6 | 22.6 | .1 | .4 | .6 | 97 | |
| టమాట | 1.5 | 6.7 | .2 | 4.2 | 1.2 | 35 | |
| వెన్న | - | - | 81 | - | 2.5 | 729 | |
| నెయ్యి | - | - | 100 | - | - | 900 | |
| తేనే | .3 | 79.5 | - | - | 2 | 319 | |
| పల్లినూనె | - | - | 100 | - | - | 900 | |
| మేకమాంసము | 21 4 | - | 3 6 | - | 1.1 | 118 | |
| చేప | 8 9 | 13.9 | 19.4 | - | 27.5 | 413 | |
| గ్రుడ్లు | 13.3 | - | 13.3 | - | 1 0 | 173 | |

పరలు చేసే అవమానాము నమృతంగా, మర్యాదను విషంగా దలచవలెను.

--- మనువు.

# శాఖాహారము యొక్క విశిష్టత.

మనలో చాలా మందికి మనకు కావలసిన మాంసకృత్తులు, పోషక పదార్ధాలు, శాఖాహార పదార్థములు అందించలేవని ఒక నమ్మకం ఉంది. ఇది కేవలము అపనమ్మకం మాత్రమే. శాస్త్రజ్ఞులు శాస్త్ర పరిశోదనలు స్పష్టముగా మనకు ఏమని తెలియజేస్తున్నాయంటే శరీరానికి కావసిన మాంసకృత్తులు అన్ని పోషక పదార్ధాలు, విటమిన్లు, ఖనిజాలు, శక్తిని శాఖాహారమే అధిక సంఖ్యలో ఇస్తాయి. సోయాచిక్కుడు మరియు వేరుశనగ కాయలలో మాంసము గ్రుడ్లకన్న అధిక మాంసకృత్తులు ఉండును. పప్పుధాన్యాలలో కూడా మాంసకృత్తులు అధికముగా ఉండటమే కాకుండా వీటిని కూరగాయలు మరియు అన్నము గాని రొట్టెతో గాని కలిపి తీసుకుంటె సమతుల్యమైన ఆహారమై శాఖాహార ప్రాణి మంసాహారపు ప్రాణికన్నా ఎక్కువ కాలము జీవించేలా చేస్తుంది.

శాఖాహార జంతువులైన గుఱ్ఱము, ఏనుగు, ఒంటె, ఎద్దు మొదలగు జంతువులు తమ జీవితములో ఎక్కువ భాగము కష్టమైన పనులు ఛేస్తుంటాయి మరియు విపరీత పరిస్థితులను తట్టుకునే శక్తిని కలిగి ఉంటాయి. ఈ మధ్యనే ఇంగ్లాండులో జరిగిన ఒక పరిశోధనలో వేటకుక్కలకు మాంసాహారము మానిపించి శాఖాహార భోజనము ఇవ్వడము వలన వాటిలో సామర్థ్యము, పరిస్థితులను తట్టుకునే శక్తిపెరిగింది. అందుకనే అంతర్జాతీయ క్రీడాకారులు ఎక్కువగా శాఖాహారముపై మొగ్గుచూపుతున్నాయి.

రాష్ట్రీయ ఆహార పరిశోధన కేంద్రము హైదరాబాద్ వారు ఆహారముపైన పరిశోదన జరిపి 100 గ్రాముల ఆహారములో పోషక పదార్థములు ఎన్ని ఉంటాయని ఈ క్రిందివిధముగా నిర్ధారించారు.

పరోపకారం పుణ్యం కొఱకు - పరపీడ పాపం కొఱకు.

--- వ్యాస మహర్షి.

# శాఖాహార - మాంసాహారుల మధ్య వ్యత్యాసము

మనము నిత్య జీవితములో చూసే ఎన్నో విషయాల ద్వారా శాఖాహార విశిష్టతను మనము గ్రహించవచ్చును. అటువంటి కొన్ని విషయాలు ఇప్పుడు మీరు చదివి మనిషికి శాఖాహారము ఎంత అవసరమో మీరే తెలుసుకొండి.

వాస్తవానికి ప్రకృతి మానవుడి శరీరాన్ని శాఖాహారము కోసమే తీర్చిదిద్దింది. అందుకనే మనకి తెలిసి వచ్చేలా కొన్ని విశిష్ట గుణాలను కూడ ప్రకృతి ప్రసాదించింది. ఉదా॥ మాంసాహార జంతువులకి వాటి నాలుక చాలా గరుకుగా ఉంటుంది. అవి వాటి నాలుకతో నీళ్ళు త్రాగుతాయి. అదే శాఖాహార జంతువులకు నాలుక మెత్తగా ఉంటుంది. అవి నీళ్ళు త్రాగుటకు పెదవులను వాడుతాయి. మాంసాహార జంతువుల యొక్క దవడలు పైకి, క్రిందికి, ప్రక్కలకు కూడ కదులుతాయి. శాఖాహార జంతువుల యొక్క ప్రేగులు వాటి శరీరం కన్నా వాటి ప్రేగులు శరీరం ఎత్తుకు 6 రెట్లు ఎక్కువగా ఉండును. అదే మంసాహారిలో 3 రెట్లు మాత్రమే ఎక్కువగా ఉండును. మంసాహార జంతువుల యొక్క స్వరము కఠోరముగా భీకరముగా ఉంటుంది. అదే శాకాహార జంతువుల స్వరము అంత కఠోరముగా ఉండదు. ప్రకృతి ప్రసాదించిన తన శరీర నిర్మాణానికి విరుద్ధంగా మనషి తప్ప ఏ జంతువు ప్రవర్తించదు. మంసాహార జంతువులు మాంసము పైనే జీవితమంతా జీవిస్తాయి. కాని అదే ఒక మనిషి పూర్తిగా మాంసాహారముపై 3 వారాలకంటే ఎక్కువగా జీవించలేడు. ఎందుకంటే ఎంతో ఎసిడిటి పేరిగి అతని శరీర వ్యవస్థ అస్థవ్యస్థమవుతుంది. అందుకే ధృవ ప్రాంతాల్లో కేవలం మంసాహారమే భుజించవలసిన పరిస్థితుల్లో జీవిస్తున్న ఎస్కిమో జాతి మనుషుల సరాసరి ఆయుష్షు 30 సంవత్సరాలు మాత్రమే ఉంటుంది. అంతేకాదు శాఖాహారము పండ్ల సువాసనలను చూసి ఏమనిషికి వికారము అనిపించదు. అదే ఒక మంసాహారము అమ్ము స్థలమునకే వెళ్లినపుడు వికారము అనిపిస్తుంది. వీటన్నింటి ద్వారా ఏమి ఋజువవుతుందంటే

---

పరుల కష్టములందు ఆదుకొనే వానికి భూమండల దాన ఫలం లభిస్తుంది.

--- విష్ణుశర్మ

మనిషి కేవలము శాఖాహారి మాత్రమే. భగవంతుడు ప్రసాదించిన ఈ శరీరాన్ని మంసాహారము అధికముగా భుజించి మనము పాడు చేసుకున్నట్లే అవుతుంది.

శాఖాహారము మనిషిని ఉత్సాహము చైతన్యముగా ఉంచుతుంది. మాంసాహారము మనుషులలో ఎన్నోవ్యాధులు కలిగించును. నరాల సంబంధమైన వ్యాధి, గోట్ వ్యాధి కొలోన్ కాన్సర్ వంటి వ్యాధులు వచ్చే అవకాశమున్నది. శాఖాహారము మనిషిని తేలికగా, ఆరోగ్యవంతముగా ఉంచును. మాంసాహారము శరీరములో ఉత్పత్తిచేసే Toxins వలననే ఎన్నోవ్యాధులు కలిగించును. శాఖాహారము తీసుకొనుట వలన శరీరములో ఉత్పత్తి అవుతున్న మలినములను బయటికి తీసుకొని వచ్చి దేహాన్ని పరిశుభ్రముగా ఉంచుతుంది.

నేడు ప్రపంచమంతా శాఖాహారంవైపు మొగ్గుచూపుతోంది. శాఖాహారపు విశిష్టతను పాశ్చాత్యులందరూ గుర్తించారు.

శాకాహారం సాత్వికమైనదని సత్వ గుణాన్ని మేధస్సునూ పెంచుతుందని మాంసాహారం రజోగుణాన్ని తమోగుణాన్ని పెంచి ఆవేశాలకు లోను చేస్తుందని మన వేదాలు చెప్పాయి.

శాఖాహారాన్ని మాత్రమే తీసుకునే జంతువులు ఆవు, గేదే, మేక, గొర్రెల వంటి వాటి పిల్లలు పుట్టిన వెంటనే కళ్ళు తెరుస్తాయి. కాసేపటికల్లా గెంతులు వేస్తూ, అటూ ఇటూ పరిగెడతాయి.

అదే మాంసాహారాన్ని మాత్రమే తీసుకొనే సింహం, పులి, పిల్లి, కుక్క మొదలైన జంతువుల పిల్లలు పుట్టివారం, పదిరోజులకు గాని కళ్ళు తెరవలేవు. అవి కాళ్ళు నిలదొక్కుకుని నడిచేసరికి దాదాపు నెల రోజులు పడుతుంది. అందుకే శాఖాహారంలో ఏదో ప్రత్యేకత ఉన్నట్లు గుర్తించారు. శాస్త్రజ్ఞులు.

శాఖాహారాన్ని గురించిన సమాచారాన్ని స్త్రీలు తెలుసుకోవడం చాలా ముఖ్యం.

---

పరులకు మేలు కల్గునని తోచినపుడే మనసు విప్పి మాటాడుము.

--- వివేకానంద.

వంటచేసి, వడ్డించే బాధ్యత స్త్రీలదే కదా !

పూర్వకాలములో దేవతలు అమృతము సేవించి అమరులై హాయిగా ఆనందముగా ఉండే వారని పురాణాల ద్వారా వింటూ ఉండే వాళ్ళము చదువుతుండేవాళ్ళము. అలాగే 5000 సం॥ క్రితము ఋషులు కూడ హాయిగా కందమూలాది ఇత్యాదులు తిని గృహస్తులుగా ఉంటూ కూడా ఆనందకరమైన జీవితము గడిపినారని మనకు తెలుసు. వాస్తవానికి అమృతమంటే ఏమి అమృతము అంటే అ........మృతము అంటే మృతము చనిపోయినది కానిది, అని అర్ధము. అంటే ప్రకృతిలో లభ్యమయ్యే ఆహారము వండకుండా లేక వేడిచేయకుండా ఉపయోగించడమే "పచ్చిఆహారము" (RAW FOOD) లేక అమృతాహారము అని అంటారు.

ఈ రోజుల్లో కూడ ఈ అమృతాహారము తీసుకొని అలనాటి దేవతలు, ఋషుల మాదిరిగా ఆరోగ్యముగా, ఆనందముగా, చైతన్యముగా జీవించవచ్చును. ఈ జీవన విధానాన్ని పూజ్యశ్రీ ఋషిప్రభాకర్ జీ దీవెనలతో మరియు ఎంతో మంది శ్రేష్టమైన సాధకుల ద్వార సిద్ధసమాధి యోగ కార్యక్రమములో మీకు అందించడము జరుగుతున్నది.

## పచ్చికూరగాయల విశిష్టత ఏమిటి ?

చాలామందికి పచ్చికూరగాయలు, పండ్లు తొందరగా జీర్ణముకావు అనే అపోహ ఉన్నది కాని నిజముగా పచ్చికూరగాయలు తేలికగా జీర్ణమయి తొందరగా రక్తములో కలుస్తుంది.

పచ్చి ఆహారము జీర్ణమగుటకు 13 గం॥ పడుతుంది వండిన ఆహారము జీర్ణమగుటకు 24 గం॥ పడుతుంది. అదే మాంసాహారము వెపుడులు 72 గం॥ పడుతుంది.

ప్రకృతిసిద్ధమైన కూరగాయలు మరియు పండ్ల రసాలవలన పోషక విలువలు

---

పరోపకారానికై పాపకర్మ చేసినా చెడుఫలితాలు కలుగవు.

--- విశ్వామిత్రుడు.

మీకు దక్కుతాయి. శరీరము సులభముగా వాటిని గ్రహించి త్వరగా రక్తములో కలుపుకుంటుంది. అధిక ప్రాణశక్తి అంటే ఏమిటి ? అన్ని జీవరాసులలో నిబిడీకృతమైన విశ్వజాతులలోను పచ్చికూరగాయలలో వివిధ పరిమాణాల్లో ఉంటుంది. అందులో అత్యధిక ప్రాణశక్తి కలిగి ఉన్నది బూడిదగుమ్మడికాయ వీటి తర్వాత ఉన్నతమైనది. క్యారెట్లు, బీట్‌రూట్ మిగిలినకూరగాయలన్నింటిలోను ప్రాణశక్తి అధికముగా ఉంటుంది. ఈ పచ్చికూరగాయలు, పండ్లు తీసుకొనుట వలన శరీరములోని అన్ని వ్యవస్థలు శుభ్రపరచబడి రుగ్మతలు తగ్గిపోయి శరీరము తేలికగా, ఉల్లాసముగా తయారవుతున్నది. ఎన్నో ఏళ్ళుగా శరీర మట్టములోపేరుకున్న మలినాలుబయటకి వచ్చి శరీరము మనస్సుకు శక్తి, సమన్వయము కుదురుతుంది. అంతర్గత భాగాలు శుద్ధి అగుట వలన ముఖములో తేజస్సు, ప్రశాంతత కనబడును. శరీరము ప్రకృతి సిద్ధముగా సహజ స్థితిలోనికి మారుతుంది. ఈ పచ్చికూరగాయలు, పండ్లరసాలు తీసుకొనటవలన నాడీవ్యవస్థ, విసర్జక వ్యవస్థ, జీర్ణవ్యవస్థ, ఎముకలకు, శ్వాసవ్యవస్థ, రక్త ప్రసరణవ్యవస్థలకు వచ్చే ఆయారకమైన వ్యాధుల ప్రభావమును తొలగించి సంపూర్ణ ఆరోగ్యవంతులను చేస్తుంది.

మనం తినే ఆహారంలో సగం మాత్రమే మన శరీర పోషణకు ఉపయోగపడుతుంది. తక్కిన సగభాగం కేవలం డాక్టర్లను, మందులకంపెనీ వాళ్ళను బతికించడానికే సరిపోతుంది.

ఈ రోగాలన్నింటికీ కూడా చాలామంది గడ్డిగా బావించే ఆకుకూరలు, చిక్కుడు, బీన్సు, గోరుచిక్కుడు, బీర వంటి పీచుగల పదార్థాలు కొంతవరకు నియంత్రిస్తాయి. పీచు ఉండే పదార్థాలను, విటమిన్లు,ప్రోటీన్లు అంటిపెట్టుకుని ఉంటాయి. దానివల్ల అవి నిదానంగా జీర్ణమై రక్తంలో కలుస్తాయి. దాంతో వెంటనే ఆకలి కాకుండా ఉంటుంది. కడుపు నిండుగా ఉంటుంది. అవి మెల్లిగా జీర్ణమై రక్తంలో కలుస్తాయి. కనుక రక్తపోటు పెరగడానికి ఆస్కారముండదు. అలాగే

---

పలు విషయాలలో నిటికి సతమతమగుచు కాలం గడపకు.

--- కుసుమ హరనాథ బాబా.

మధుమేహ రోగులకు రక్తంలో చెక్కర పెరుగదు. అందుకే మధు మేహం, గుండెపోటు, అధిక రక్తపోటు ఉన్నవారు నిదానంగా భోంచేయాలి. ఒకేసారి కాకుండా అప్పుడప్పుడూ కొద్దిగా తినాలని సలహా ఇస్తారు డాక్టర్లు. పీచు పదార్థంవల్ల త్వరగా విరేచనమై, ఆరోగ్య హాని కలిగించే టాక్సిన్‌లను త్వరగా బయటకి పంపివేస్తుంది. అందువల్ల పెద్ద ప్రేవుల కాన్సర్‌ను నివారిస్తుంది.

అసలు అన్నింటికన్నా ముందుగా చెప్పుకోవలసింది కారెట్ కాన్సర్ నిరోధకంగా గుర్తింపు పొందింది. దీనిలో బీటాకెరోటిన్ అనే 'ఎ' విటమిన్ మూలపదార్థం ఉంది. ఇందులో ఉండే బీటాకెరోటిన్, ఆస్కార్బిక్ ఆసిడ్ వల్ల కాన్సర్ వచ్చే అవకాశాలు తగ్గుతాయి. బీటాకెరోటిన్ ఆకుకూరలు, గుమ్మడికాయ, మామిడిపండు, నారింజ, ఆపిల్ వంటి వాటిలో కూడా ఉంది.

ఆకుపచ్చని కూరలలోని 'ఇ' విటమిన్, బీటా కెలొటీన్, పళ్ళలోని 'సి' విటమిన్ కొలెస్ట్రాల్‌ను తగ్గించి గుండె జబ్బులు రాకుండా నివారిస్తాయి. కొవ్వు పదార్థాలు ఎక్కువ కావడంవల్ల గర్భాశయ కాన్సర్ వస్తుంది.

మొలకెత్తిన గింజలలో ప్రోటన్లు, నీళ్లలో కరిగే విటమిన్లు ఉంటాయి. ఇవి శరీరానికి ఎంతో ఉపకరిస్తాయి.

కాబేజి, కాలీఫ్లవర్‌లలో ఎన్నో విటమిన్‌లు ఉన్నప్పటికి, కాబేజీని అధికంగా తింటే అందులోని 'గాయిటరోజన్స్' 'థైరాయిడ్' వంటికి హార్మోన్లను తగ్గించే అవకాశం ఉంది.

కాకరలో పీచు పదార్థం ఉంది. దీనిలోని చేదువలన ఇది మధుమేహరోగులకు వ్యాధిని అదుపు చెయ్యడంలో ఉపకరిస్తుంది. అలాగే మెంతికూర మెంతులుకూడా.

పీచు పదార్థాలున్న కూరగాయలను తినడంవల్ల త్వరగా వి రేచనమవుతుంది. ఆహారంలో విషపదార్థాలు (టాక్సిన్‌లు) ప్రేగులకు హాని కలిగించకుండా విరేచనంద్వారా విసర్జింపబడతాయి. ఈ మేలు చేసి పుణ్యం కట్టుకునేది పీచు పదార్థాలే కదా !

పవిత్రతను సాధించే పోరాటంలో ప్రాణాలనైనా త్యజించు.

--- వివేకానంద.

యవ్వన దశలోకి అడుగు పెట్టిన ఆడపిల్లలు మల్లెతీగల్లా ఉండాలని తిండి మానేసి మాడుతుంటారు. అందుకే వారికి పచ్చి కూరల సలాడ్, పండ్లు ఇస్తుండాలి. ఐశ్వర్యారాయ్, సుస్మితాసేన్ ల వంటి సుందరీమణులు, శ్రీదేవి, మీనాక్షి శేషాద్రి వంటి నటీమణులు శరీరాన్ని అదుపులో ఉంచుకోవడానికి పచ్చి కూరలు, పళ్ళు తింటారంటే వినడానికి ఆశ్చర్యంగా ఉంటుంది.

## పచ్చి కూరగాయలు, పండ్ల రసాలు తీసుకునే విధానం

ఏ పండ్లనైన ఉన్నది ఉన్నట్లు తీసుకోవచ్చు. జ్యూస్ కావాలనుకుంటే జ్యూస్‌గా తీసుకొని త్రాగవచ్చును.

ఏ కూరగాయలనైన 5 రకాలుగా ఆహారముగా తీసుకొనవచ్చు.

1. తీపి ఇష్టమైన వాళ్ళు కూరగాయలను తురుముకొని గాని కట్ చేసుకొని గాని అందులో చెక్కరగాని బెల్లం గాని కలిపి తీసుకోవాలి.

2. తీపి ఇష్టములేని వాళ్ళు తరిగిన, తురిమిన కూరగాయలతో, ఆకుకూరలు, నిమ్మరసం (Garlic Trouble , Alcer ఉన్నవాళ్ళు నిమ్మరసం తీసుకొనవద్దు) ఉప్పు, కొత్తిమీర, పూదీన, కరివేపాకు కలిపి తీసుకోవాలి.

3. తరగిన, తురిమిన కూరగాయలను, ఆకుకూరలు, పెరుగులో వేసి అందులో ఉప్పు ఇష్టమున్న వాళ్లు ఉప్పు చెక్కర ఇష్టము ఉన్న వాళ్ళు చెక్కర వేసుకొని అందులో తురిమిన కొబ్బరి, దానిమ్మ గింజలు వేసి తినోచ్చు.

4. ఏ కూరగాయలు అయిన ఆకుకూరలైన పచ్చవి చిన్నచిన్న ముక్కలుగా కోసుకొని అన్నము, కూరతో పాటు కలుపుకొని తినాలి.

5. కొన్నిసార్లు మీ కిష్టమైన రీతిలో పండ్లను, కూరలను కలిపి మిశ్రమంగా చేసుకొని తినవచ్చు

ఉదా : పైనాపిల్, బూడిద గుమ్మడి, అరటిపండు, బీట్‌రూట్, అరటిపండు, కొబ్బరి

---

పాటుపడనిదే సాపాటు చేయుట పాపము. ఋణము కూడ.

--- వినోబాభావే.

# పచ్చి కూరగాయలతో పసందైన తయారీలు

## స్వీట్ ఐటమ్స్

**బీట్ రూట్ స్వీట్ :-** బీట్ రూట్లు రెండు మధ్య రకము సైజువి తీసుకొని వాటి తొక్కలు తీసి తురుము పీటపై తురుముకోవాలి అలా తురిమిన బీట్ రూట్‌కి ద్రాక్షపండ్లు మధ్యగా కోసిగాని, అరటి పండ్లు కాని, కొబ్బరి కోరు గాని, బొప్పాయి పండ్ల ముక్కలు గాని కలపాలి. జీడిపప్పులు, కిస్‌మిస్‌లు, మీ రుచికి అనుగుణంగా కావలసినంత తురిమిన బెల్లము కలిపి బాగా పిసకాలి చివరిగా పైపైన యాలకుల పొడిని, రెండు చుక్కల నిమ్మరసం కలిపి తింటే  అద్భుతంగా ఉంటుంది.

**బీట్‌రూట్ లడ్డు :** రెండు మధ్యరకము బీట్ రూట్లను తొక్క తీసి తురుకోవాలి తురిమిన కోరును రసము పిండి వేరుగా ఉంచుకోవాలి. మీరుచికి తగినంత తురిమిన బెల్లమును, జీడిపప్పును, కిస్‌మిస్, బాదాము వగైరాలను తురిమిన బీట్‌రూట్‌కు కలిపి లడ్డు కట్టాలి. ఇలా తయారు చేసుకొన్న లడ్డూను వేరుగా ఉంచుకోవాలి. 10 లడ్డూలకు 100 గ్రా॥ బొంబాయి రవ్వను, కొద్దిగా నేతిలో దోరగా వేయించాలి. వేయించిన రవ్వ చల్లారిన తరువాత ఇంతకుముందు చేసిన లడ్డూలను రవ్వలో దొర్లించి లడ్డూ మొత్తానికి రవ్వ అంటేలా చూడాలి. ఇవి చూడటానికి ఎంతో బాగుంటాయి మరియు తినడానికి ఎంతో రుచిగా ఉంటాయి.

**క్యారెట్ స్వీట్ :** ఆరు క్యారెట్లు లేతవి తొక్క తీసి తురుముకొని ఉంచుకోవాలి. తురిమిన క్యారెట్లకు తగినంత చెక్కర, తురిమిన పచ్చికొబ్బరి, జీడిపప్పు, కిస్‌మిస్‌లను కలుపుకోవాలి. సువాసన కొరకు పైన యాలకుల పొడి కలిపితింటే ఎంతో రుచిగా ఉంటుంది.

---

పాతివ్రత్యానికి చరమదశ మగడు, భార్యను అమ్మాయని పిలుచుటే.

--- జిల్లెళ్ల-అమ్మ.

**పొట్లకాయ, బనాన రోల్స్ :** లేత పొట్లకాయలను చక్రాలుగా కోసుకోవాలి. ఈ చక్రాల మధ్యలోని గుజ్జును తీసివేయాలి. దోరగా పండిన అరటి పండ్లను తీసుకొని సరిగ్గా పొట్లకాయ ఎంతలావు చక్రాలుగా కట్ చేసారో అంతేలావుగా అరటి పండ్లను చక్రాలుగా కోసుకోవాలి. పొట్లకాయ రౌండ్ మధ్యలో అరటి పండు రౌండ్‌ను ఉంచాలి అరటి పండ్ల ముక్కలపైన చెర్రీ గాని, కిస్‌మిస్ గాని ఉంచాలి. కొద్దిగా యాలకుల పొడి చల్లాలి. ప్లేట్ చుట్టూరా రా ఫుడ్ పెట్టి మధ్యలో ఇతర రాఫుడ్‌ను సర్వ్‌చేసి తింటే ఎంతో అద్భుతంగా ఉంటుంది.

**పొట్లకాయ పెరుగు స్వీట్ :** ఒక టీకప్పు పొట్లకాయ ముక్కలను సన్నగా తరిగి ఉంచుకోవాలి. రెండు కప్పుల చిక్కటి పెరుగు తరిగిన ముక్కలకు కలుపుకోవాలి. దానికి తగినంత చక్కరవేసి కొద్దిగ తురిమిన కొబ్బరి కిస్‌మిస్‌లు, నానిన ఎండు కర్జూర ముక్కలు వేసుకొని తింటే చాలా బాగుగా ఉంటుంది.

**బబానా కోకో జెల్లి :** 6 అరటి పండ్లను తీసుకొని ముక్కలుగా చేసుకోవాలి దీనికి సమానముగా పచ్చి కొబ్బరి కోరును తురుముకొని ఉంచుకోవాలి. రుచికి తగినంత చెక్కర వేసి బాగా పిసకాలి. ఇందులో సారపలుకులు వేసుకొని తింటే ఎంతో రుచిగా ఉంటుంది.

**బనానా మిలన్ మెలోడి :** 6 అరటిపండ్లు మధ్యసైజు తర్బుజ తీసుకొని ముక్కలుగా చేసి కావలసినంత తురిమిన బెల్లము వేసుకొని వాటిపైనా కాజు, బాదాం కలుపుకొని తింటే ఎంతో రుచిగా ఉండును.

**ఫ్రూట్ సలాడ్ ·** 3 అరటిపండ్లు, 15 ద్రాక్షపండ్లు, 1 యాపిల్, 4 పైనాపిల్ ముక్కలు, రెండు సపోటాలు, చారెడు దానిమ్మ గింజలు, 4 సంత్రా తొనలు, చిన్న కప్పు కొబ్బరి కోరు వీటన్నింటిని ఒక గిన్నెలో వేసి సాధ్యమైనంత తక్కువ బెల్లము

---

పాదముల తడియారిన పిదప నిద్రించువాడు సంపన్నుడగును.

--- చరకుడు.

వేసుకొని మరీ గట్టిగా కాకుండా పైపైనే పిసికి ఉంచుకోవాలి. మీ ఇష్టాను సారంగా ఎన్ని రకాల డ్రై ఫ్రూట్స్ వాడుకొనవచ్చును. ఫ్రూట్ సలాడ్ చేసుకొనడానికి సీజన్‌లో దొరికే ఏ పండ్లనైనా వాడవచ్చును. అయితే పుల్లటి పండ్లను, ద్రాక్ష, సంత్రాలు తక్కువగా వేసుకొని తింటే మహా అద్భుతంగా ఉంటుంది.

**క్యారెట్ బనానా పుడింగ్** : తురిమని క్యారెట్టుకు తగినంత చెక్కర వేసి కలిపి ఉంచుకోవాలి. దోరగా పండిన అరటి పండ్లను ముక్కలుగా చేసి అందులో కలపాలి అందులో ఒక టేబుల్ స్పూన్ పాలు కలిపి జీడి పప్పులు, కిస్‌మిస్‌లు, బాదాం పైపైన చిలకరించి యాలకుల పొడి కలిపి తింటే మహా రుచిగా ఉంటుంది.

: నాలుగు క్యారెట్లను తురిమి ఉంచుకోవాలి వాటిలో గుప్పెడు నీటిలో నానబెట్టిన అటుకులను కలపాలి. దానికి తగినంత చెక్కరగాని, బెల్లము గాని కలిపి లడ్డూలుగా చేసి తినవచ్చును.

**స్వీట్ స్ప్రవుట్స్** : మొలకెత్తిన పెసర్లు, మొలకెత్తిన శనిగలు నాలుగు గంటలు నానబెట్టిన వేరుశనిగ గింజలు, తురిమని కొబ్బరి ఒక కప్పు తీసుకొని తగినంత చెక్కర లేదా బెల్లము కలుపుకొని తింటే మహా రుచిగా ఉంటుంది.

**హోసీ లీఫ్ డిలైట్** : లేత పాలకూర ఆకులు కొంచెము పెద్దవిగా కోసుకొని ఉంచుకోవాలి. కోసి ఉంచిన ఆకులకు కిల్లీ కొట్టులో దొరికే గుల్‌కంద్ గాని లేద స్వచ్ఛమైన తేనెను కలిపి తింటే ఎంతో బలం.

**పోమ గ్రనేట్ సలాడ్** : ఆపిల్ ముక్కలు కప్పెడు, దానిమ్మగింజలు కప్పెడు, సగం పైనాపిల్ ముక్కలు, కొన్ని ద్రాక్షపండ్లు గిన్నెలో తీసుకొని రెండు లేదా మూడు స్పూన్‌ల వెన్న కలిపి, దీనికి చెక్కర కలుపుకొని తింటే ఎంతో రుచి.

---

పాదములచే గాని చేతితో గాని జలమును గొట్టరాదు.

--- శంఖుడు.

**బూడిద గుమ్మడి సలాడ్ :** బూడిద గుమ్మడి కాయ పొట్టు తీసి చిన్న ముక్కలుగా తరిగి చెక్కర వేసి నానబెట్టాలి. ఇందులో పైనాపిల్ ముక్కలను చిన్నవిగా కట్ చేసి ముక్కలను వేసి వాటిపై కొద్దిగా యాలకుల పొడిని కలిపి తీసుకుంటే ఎంతో రుచి.

**పైనాపిల్ బనానా సాండ్‌విచ్ :** రెండు పైనాపిల్ ముక్కలు గుండ్రముగా కోసుకొని ఉంచుకోవాలి. వాటికి మధ్యలో రెండు అరటి పండ్లను గుజ్జుగా పిసికి ఉంచుకోవాలి. రెండు ముక్కల మధ్యలో బాగాపిసికన అరటి పండ్ల గుజ్జును పెట్టి. వాటిపై కొద్దిగా చెక్కర చల్లి తింటే చాలా బాగుంటుంది.

**రూటీ స్వీట్ :** రెండు బంగాల దుంపలను పొట్టు తీసి మంజీర పీటపై తురుముకోవాలి దానికి తగినంత బెల్లము బాదాములు, జీడిపప్పులు, సారాపలుకులు కలుపుకొని తీసుకొని తింటే ఎంతో రుచి.

**నూల్‌కుల్‌స్వీట్:** నూల్ కోల్‌గడ్డ తొక్కతీసి మంజరీ పీటమీద తురుముకోవాలి. దానికి తురిమిన సోరకాయ మిశ్రమాన్ని చెక్కర జీడిపప్పు కలుపుకొని తినవలెను.

**రాచగుమ్మడి స్వీట్ :** బాగా పండిన రాచగుమ్మడిని తొక్కతీసిన తరువాత మంజరి పీటమీద తురుమకోవాలి దానికి కావలసినంత చెక్కరవేసి బాగా పిసకాలి దానికి కావలసినంత యాలకుల పొడి కలిపి తినవలెను. కాజు బాదాం కూడా కలపవలెను

## ఉప్పుతో కలిపి తయారుచేసుకొనే పచ్చి కూరగాయల రకాలు :

**మిక్స్‌డ్ వెజిటెబుల్ సలాడ్ :** చిన్న సోరకాయ, బీరకాయ, పండు దోస ...క్కలను తీసి చిన్న చిన్న ముక్కలుగా తరుగు కొని ప్రక్కకు పెట్టాలి. ఒక కట్ట

---

పాదరక్షల దాత యొకప్పుడును ముండ్ల పీడ పొందడు.

--- మనువు.

కొత్తిమీర 10 పూదిన ఆకులు, కొద్దిగా కరివేపాకు చిన్న చిన్నగా తరుముకోవాలి. తరువాత ఈ ముక్కలకు ఆకుకూరల మిశ్రమాన్ని కలిపి తగినంత ఉప్పుకలిపి కలుపుకోవాలి. అసిడిటి లేనివారు 10 చుక్కల నిమ్మరసం కలుపుకొని తినవచ్చును.

గమనిక :- పై కూరగాయల మిశ్రమంలో మీకిష్టమైతే తురిమని క్యారెట్లును, తరిగిన బూడిద గుమ్మడి, పైనాపిల్ ముక్కలు చిన్నవిగా తరిగి, కొద్దిగా పచ్చి కొబ్బరి కోరు కూడా కలుపుకొనిన చాలా రుచిగా ఉండును. పచ్చి బటానీలను లేదా కాలిఫ్లవర్ ముక్కలను కూడా కలుపుకోవాలి.

**క్యారెట్ లీఫ్ వెజ్** : నాలుగు క్యారెట్లను మాంజరీ పీటమీద తురుముకొని ప్రక్కకు పెట్టుకోవాలి. ఒక కట్ట కోతిమీర, 30 కరివేపాకు ఆకులు, 10 పూదిన ఆకులు కత్తిరించుకొని క్యారెట్లో కలుపుకొని కాజా, బాదాము ముక్కల్ని అందులో వేసుకొని తగినంత ఉప్పు కలుపుకొని తినవచ్చును అసిడిటి ఉన్నవారు నిమ్మరసం వాడకూడదు.

**క్యాబేజి కోసుంబరి** : క్యాబేజి సన్నగా కావలసినంత తరుగుకొని అందులో కావలసినంత తురిమని కొబ్బరి వేసుకొని కొద్దిగా నిమ్మరసం పిండుకొని తినవలెను. గ్యాస్ట్రిక్ ట్రబుల్ ఉన్న వారు తినవద్దు.

**దొండకాయ రోల్స్** : కావలసినంత దొండకాయలు సన్నగా ముక్కలు చేసి అందులో తురిమిన పచ్చికొబ్బరి కొద్దిగా ఉప్పు కలుపుకొని తినవలెను.

**బెండకాయ బజ్జీలు** : కడిగిన బెండకాయలను నిలువుగా కోసి అందులో తగినంత ఉప్పుకలిపిన తురిమిన కొబ్బరి మిశ్రమాన్ని బెండకాయ మధ్యలో పెట్టి తింటే ఎంతో బాగుంటుంది.

పాదరక్షలు తాల్చక పయనింపకు, పరుల పాదరక్షలు తాల్చకు.

-- వేమన? 

**విజటెబుల్ స్ప్రౌటి మిక్స్ :** పెసర మొలకలను కావలసినన్ని తీసుకొని కొద్దిగా తురిమిన క్యారెట్టు, కొత్తి మీర, కరివేపాకు, పూదీన కొద్దిగా అందులో వేసి కావలసినంత ఉప్పు వేసుకొని 10 చుక్కల నిమ్మరసం వేసుకొని తినవలెను.

**కుకుంబర్ సలాడ్ :** కీర దోసకాయలు, పండు దోస పొట్టుతీసి చిన్న ీ ముక్కలుగా కట్ చేసుకొని తగినంత ఉప్పు, మిరియాల పొడి కొద్దిగా కలుపుకొని తినవలెను.

**బీన్ సలాడ్ :** లేత బీన్స్ గాని, లేత అల్సంత కాయ సన్నగా కట్ చేసుకొని దానిలో తగినంత ఉప్పు తురిమని పచ్చికొబ్బరి కొద్దిగా నిమ్మరసం కలుపుకొని తినవలెను.

**పొట్లకాయ సలాడ్ :** లేత పొట్లకాయలను సన్నగా కట్ చేసి తగినంత ఉప్పు, జిలకర పొడి వేసికొని దానికి కొద్దిగి తురిమని పచ్చికొబ్బరిని కలుపుకొని తినవలెను.

**పీ ఫ్లవర్ సలాడ్ :** కాలి ఫ్లవర్స్ రెండు నిమిషాల సేపు తక్కువ నీటిలో ఉడికించి పచ్చి బటానీలు కలిపి తగినంత ఉప్పు కొద్దిగా నిమ్మరసం కలిపి తినవలెను

గమనిక .- పెరుగు పచ్చళ్లలో గాని సాల్ట్ వెజిటెబుల్‌లలో గాని పోపు వేసుకొని తింటే చాలా బాగుంటుంది. పోపులో చిన్న చెంచాడు నూనె సగం స్పూన్ జిలకర్ర, సగం స్పూన్ మినపప్పు దోరగా వేయించి కరివేపాకు కలుపుకొని పోపును పెరుగు పచ్చళ్లలో కలుపుకోవాలి. నూనె తక్కువగా వాడాలి. పోపులో మిరప విత్తనాలు వేయవద్దు.

పాదాలు నేలపై ఆన్చక పీటపై గూర్చుండి భుజింపకు.

--- యజ్ఞవల్క్యుడు.

# పెరుగు పచ్చళ్ళు

**మిక్స్‌డ్ విజిటెబుల్ రైతా :** సొరకాయ, బీరకాయ, పండుదోస, చిన్న ముక్కలుగ తరుగుకొని పెరుగులో వేసి దానికి తగినంత ఉప్పు కలుపుకొని చిన్నగా కట్ చేసిన కోతిమీర పుదీన కలుపుకొని తింటే ఎంతో రుచి.

**గోర్డ్ గోల్డ్ :** సొరకాయను మాంజరి పీట మీద తురుముకొని దానికి కావలసినంత ఉప్పు కలుపుకొని పెరుగులో వేసి వడ్డించుకునే ముందు దానిమ్మ గింజలు కలుపుకొని తినవలెను.

**రోజీ రైతా :** బీట్ రూట్ తురిమి సరిపడేఅంత ఉప్పు కలుపుకొని ఒక చిటికెడు జీలకర్ర పొడి చిటికెడు ఉప్పు కలుపుకొని వడ్డించే ముందు పెరుగు కలుపుకొని తినవలెను.

**క్యారెట్ కర్డ్ చట్నీ :** క్యారెట్‌ను చిన్న ముక్కలుగా కట్‌చేసి లేదా తురిమి గాని అందులో తగినంత ఉప్పు తగినంత పెరుగు వేసుకొని తినవలెను.

**పొట్ల కాయ చెట్నీ :** పొట్లకాయను చిన్నముక్కలుగా తరిగి దానికి తగినంత చక్కర కొద్దిగా ఉప్పు పెరుగులో కలిపి తింటే ఎంతో రుచిగా ఉంటుంది.

**లీఫీ రైతా :** పాలకూరను చిన్న చిన్నగా తరుముకొని తురిమిన పచ్చికొబ్బరి కలుపుకొని సరిపడే అంత ఉప్పు పెరుగు కలుపుకొని తినేముందు దానిమ్మ గింజలు కలుపుకుని తింటే ఎంతో అద్భుతం.

ప్రజా సేవ చేశానని గొప్పలు చెప్పకు సేవాఫలం కోల్పోతావు.

--- మహాత్మాగాంధీ.

**మహా ప్రాణ :** బూడిద గుమ్మడిని చిన్న చిన్న ముక్కలుగా కోసి గ్రైండింగ్ చేయవలెను. గ్రైండింగ్ చేసిన బూడిద గుమ్మడిని ఒక బట్టలో వడగట్టి వచ్చిని పిప్పికి చిక్కటి పెరుగు, కొద్దిగా పచ్చి కొబ్బరి, తగినంత ఉప్పు కొద్దిగా పోపు కలుపుకొని తింటే మహా అద్భుతంగా ఉంటుంది.

**క్యాబేజి రైతా :** సన్నగా తరిగిన క్యాబేజికి కొద్దిగా పచ్చి కొబ్బరి చిక్కటి పెరుగు కొన్ని దానిమ్మ గింజలు కొద్దిగా పంచదార కలుపుకొని తింటే ఎంతో రుచిగా ఉంటుంది.

**ఆమ్లా పంచ్ పెరుగు పచ్చళ్ళు :** (చిన్న ఉసిరి) రాచ ఉసిరి కాయలను గ్రైండ్ చేసి దానిలోని విత్తనాలను తీసి పిప్పిలో చిక్కటి పెరుగు కొద్దిగా ఉప్పు కొద్దిగా పోపు కలుపుకుంటే అద్భుతంగా ఉంటుంది.

**గమనిక :** ఏ కాయకూరలైన ఆకుకూరలైనా సరే పెరుగులో వేసుకొని ఉప్పు కలిపితే చాలా రుచిగా ఉంటుంది. సాల్ట్ వెరైటీస్‌లలో పెరుగు పచ్చళ్ళలో ఉప్పును, పెరుగును, నిమ్మకాయను, కొత్తిమీరను, జీడిపప్పులను, బాదాములను, యాలకుల పొడిని వడ్డించే ముందు కలుపు కొని తినవలెను.

## మాల్ట్ మాధుర్యాలు

ఒక గ్లాసెడు మాల్ట్ కావాలంటే ముప్పావు గ్లాసెడు నీళ్ళు స్టౌవ్‌పైన వేడిచేసి మరిగించాలి. మిగతా పావుగ్లాసు చల్లని నీటిలో ఒక స్పూన్ మాల్ట్ పౌడర్‌ను కలిపి మరిగే నీటిలో వేయవలెను. దానికి కొద్దిగా బెల్లము లేదా చక్కర కలుపుకొని మరిగించి త్రాగితే ఎంతో కమ్మగా ఉంటుంది

అంతాఒక్కటే రెండనేది లేదనువారికి రాగద్వేషాలు లేవు.

--- చంద్రశేఖరేంద్రసరస్వతి.

అరపాకెట్ మాల్ట్ పౌడర్‌కు 100 గ్రా॥ల నెయ్యి కలిపి కొంచెం ఎండు కొబ్బరి కలిపి ఉండలు గట్టి తింటే ఎంతో శక్తి దాయకం.

అరకేజి గోధుమ పిండిలో 3 టేబుల్ స్పూన్‌ల మాల్ట్ పౌడర్‌ను కలిపి రొట్టె మెత్తగా చేసుకొని తింటే ఎంతో రుచిగా ఉంటుంది.

3 టేబుల్ స్పూన్ ల మాల్ట్ పౌడర్ తీసుకొని పావు గ్లాసు పేస్టులాగా చేసి స్టవ్ మీద జావలాగా ఉడికించి చల్లారిని తరువాత చిక్కటి పెరుగులో ఈ జావను చల్లని నీటిలో కలిపి మజ్జిగలాగ చేసుకొని తాగితే ఆరోగ్యానికి చాలా మంచిది. ఎండాకాలంలో ఎంతో చల్లదనం.

మాల్ట్ పౌడర్ ను తీసుకొని నీటిలో ఉండలు లేకుండా పొడిపొడిగా, తడిగా ఉండేట్లు కలుపుకొని ఈ మిశ్రమాన్ని ఇడ్లీ పాత్రలో ఉడికించి అటుతరువాత చెక్కర పొడిని, కొబ్బరి కోరును, ఇలాయిచి పొడి, నెయ్యి కలిపి తింటే అద్భుతంగా ఉంటుంది.

డయాబెటిస్ ఉన్నవారు చెక్కర కలపని రాగిమాల్ట్ మిశ్రమాన్ని రొట్టెగా చేసుకొని తింటే చాలా మంచిది.

రాగుల పౌడర్‌ను అన్నంలాగా సరిపడే నీరు ఉప్పువేసి ఉడికించి దించుకునే ముందు పిడికెడు అన్నం కలిపి దించుకొని ఈ మిశ్రమాన్ని కాస్త ఎక్కువ కూరతో కలుపుకొని తింటే షుగర్ ఉన్నవాళ్ళకు ఎంతో ఆరోగ్యకరము.

అందరిలో దేవుని, తనలో సర్వులను చూచువాడు ఉత్తమ భక్తుడు

--- నారదానంద.

# బట్టర్ మిల్క్ డిలైట్స్

పెరుగు చిలికి మజ్జిగ చేసాక అందులో చిటికెడు ఉప్పు ఒక స్పూన్ షుగర్ వేసి నాలుగు చుక్కల నిమ్మరసం కలిపి కొంచెం కొత్తిమీర కలుపుకొని త్రాగితే చాలా రుచిగా ఉంటుంది.

మజ్జిగలో కాస్త ఉప్పు కాస్త నూనె తక్కువగా ఉన్న జీలకర్ర కరివేపాక పోపు వేసుకొని త్రాగితే చాలా రుచిగా ఉంటుంది. చలువ చేస్తుంది.

దనియాలు, జీలకర్రను వేయించి పొడిచేసి ఈ పొడిని చల్లటి మజ్జిగలో కలుపుకొని త్రాగితే చాలా రుచి మరియు శరీరానికి ఆరోగ్యకరం.

రేగుపండ్లు ఎండబెట్టి గింజలు తీసి పొడిగా దంచి ఆ పొడిని మజ్జిగలో కలిపి త్రాగితే చాలా మంచిది.

మజ్జిగలో ఒక స్పూన్ తేనె కలిపి త్రాగితే చాలా మంచిది. పెద్ద ఉసిరి కాయలను ఎండబెట్టి పూర్తిగా ఎండిన తరువాత గింజలతో సహా పొడిచేసి ఆపొడి ఒక స్పూన్ గ్లాసెడు మజ్జిగలో కలిపి త్రాగితే తెల్లబట్ట తక్కువ అగును చలువ చేయదు.

# వివిధ పండ్ల రసాలు వాటి ప్రయోజనము

కూరగాయలను, పండ్లను తీసుకునే ముందు వంట సోడాతో అరబకెట్ నీళ్ళు కలిపి అందులో కూరగాయలను, పండ్లను వేసి అరగంట నానబెట్టి తుడిచి భద్రపరచుకోవాలి. పండ్ల రసాల వల్ల శరీర నిర్మాణ వ్యవస్థ అంతా శుభ్రం

---

అవుతుంది కాయగూరలరసాల వల్ల అన్ని అవయవాలుసక్రమంగా పనిచేస్తాయి. ఈ రసాలేమిటి? ఎంతవరకు ఉపయోగపడతాయో చూద్దాం

## ఆపిల్ జ్యూస్

శరీరానికవసరమైన 16 పదార్థాల్లో తొమ్మిది ఆపిల్ లో ఉన్నాయి. ఆరు ప్రధాన విటమిన్లలో నాలుగు ఉన్నాయి. ఇవికాక ఆపిల్ కు రోగాలను నివారించగల శక్తి ఉంది. శరీరంలో రోగనిరోదక శక్తిని పెంచుతుంది. కాలేయం, మూత్రపిండాలు సరిగా పనిచేసేట్టు చూడడమే కాక ఆకలిని కలిగిస్తుంది. ఆపిల్ వల్ల డయేరియా, కృషించిపోవడం తగ్గవచ్చు.

## నేరేడు రసం

నేరేడు రసం రక్తాన్ని శుభ్రపరుస్తుంది. మొటిమలకు, అజీర్ణానికి, ఆస్మాకు, డయేరియాకు గాల్‌స్టోన్‌కు మంచి విరుగుడుగా పనిచేస్తుంది.

## అరటిపండు రసం

అరటిపండు రసం ఆరు రకాల విటమిన్లు ఉన్నాయి. అరటిపండు త్వరగా జీర్ణమవడమే కాక శరీరానికి కావలసిన శక్తిని వెంటనే అందిస్తుంది. అజీర్ణానికి, డయేరియాకి అరటిపండు ఎంతో మంచిది ముఖ్యంగా చిన్నపిల్లల్లో వచ్చే డయేరియాకి పండిన అరటి ఎంతో మంచిది. ఇందులో ఏ విటమిన్, ఇతర విటమిన్లు ఉన్నాయి. మూడుపాళ్ళు కారట్ రసానికి ఒకవంతు కాబేజి రసం కలిపి తాగితే పోషక విలువలు అద్భుతంగా లభిస్తాయి.

## కారట్ రసం

కారట్ రసం ఆరోగ్యానికి ఎంత మంచిదో అందరికీ తెలిసిందే. కారట్ లో 12 రకాల ముఖ్యమైన ఖనిజాలు, అయోడిన్ ఉండి శరీరానికి ఎంతో మేలు చేస్తాయి.

---

పాపము చేసి దాచినచో దాని ఫలం పెరుగును

శంక మహర్షి.

అల్సర్లు, క్యాన్సరు వంటి రోగాలకు తగ్గించడంలో కారట్ ఉపయోగపడుతుంది. నరాల వ్యవస్థని బలోపేతం చేసి జ్ఞాపకశక్తిని పెంచుతుంది. గర్భిణీస్త్రీలకు కారట్ రసం ఎంతో మంచిది.

## దోసకాయ రసం

శరీరాన్ని చల్లబరిచే గుణం దోసకాయకున్నందువల్ల వేడి ప్రదేశాల్లో దీన్ని ఎక్కువగా వాడతారు. దోసకాయ రసం శరీరంలోని మలినాలు, అనవసర పదార్థాలు బయటికి పోయేందుకు దోహద పడ్తుంది. అందుకే కిడ్నీ వ్యాధులకు, కీళ్ళ నొప్పులకు దోసకాయ వాడమంటారు.

## ద్రాక్షరసం

ద్రాక్ష అసిడిటీని తగ్గించి రక్త ప్రసారాన్ని మెరుగు పరుస్తుంది. రక్తంలో లోపాలకు, శ్వాస సంబంధ సమస్యలకు ద్రాక్ష రసం ఎంతో బాగా పనిచేస్తుంది. లివరు, చర్మం, నరాలు, కీళ్ళకు సంబంధించిన, నొప్పులకు కూడా ద్రాక్ష మంచిది. లో బి.పి. ఉన్నవారికి కూడా ద్రాక్ష రసం మేలు చేస్తుంది.

## నిమ్మరసం

రుచినీ, ఆరోగ్యాన్నీ కూడ అందించేది నిమ్మరసం. నిమ్మలో ఎన్నో సుగుణాలున్నాయి. ఇవి దగ్గు, జలుబు, ఆస్మా, బ్రోంకైటిస్ వంటి వాటికి పనిచేస్తాయి. కామెర్లు తగ్గడానికి కూడా నిమ్మరసం తోడ్పడుతుంది. విటమిన్ సి నిమ్మరసంలో ఎక్కువగా ఉంటుంది. నిమ్మరసం కూడా రక్తాన్ని శుభ్రపరుస్తుంది.

## తోటకూర రసం

అనేక అమూల్యమైన విటమిన్లు, ఖనిజ లవణాలు ఉన్న తోటకూరను రసం

---

పడివాదం చేసే వానితో మాట్లాడి, పగలు పంతాలు తెచ్చుకొనకు.

---చరకుడు.

చేసి, ఆ రసాన్ని కారట్ రసంతోగాని, ఇతర రసాలతోగాని కలుపుకొని తాగితే మంచిది. నీటిలో వేసి ఉండే పపైన్ అజీర్తికి సంబంధించిన సమస్యల్ని తీరుస్తుంది. స్త్రీలలో ఉండే రుతు సంబంధ సమస్యల్ని కూడా తీర్చి సక్రమంగా చేస్తుంది. యుక్త వయసులో ఉన్న యువతీ యువకులకు, టీనేజ్ వారికి అనాసరసం మంచిది.

### రేగుపండ్ల రసం

అజీర్ణం, మలబద్ధకం, పైల్స్ మొదలయిన రోగాలన్నిటినీ రేగుపండ్ల రసంమంచి ఔషదం. గ్లాసుడు రసం రోజుకు రెండుసార్లు తీసుకుంటే పై లక్షణాలున్న వారికి ఉపశమనం ఉంటుంది.

### దానిమ్మ రసం

చాలామంది ఇష్టపడే దానిమ్మరసం రుచికే కాక స్థూల కాయులకు, హై బి.పి. లివరుకు సంబంధించిన సమస్యలకు రోగ నివారిణిగా పేరు పొందింది. కడుపులో పడే నులిపురుగులను నాశనం చేసి బలాన్ని పుష్టిని కలిగిస్తుంది.

ఇవేకాక మీ సృజనాత్మక శక్తిని ఉపయోగించుకొని వివిధ పచ్చికూరలను పండ్లను మీ కిష్టమైన రీతిలో కలుపుకొని కొత్తకొత్త వంటకాలను మీరే సృష్టించొచ్చు. వాటిని మీరు ఇతరులకు నేర్పించొచ్చు.

## సహజ సంపదలు

మన జీవితంలో నిత్యము మనకు అందుబాటులో ఉండే ఎన్నో ఆహార పదార్థాలలో కొన్ని విశిష్టమైన గుణాలు, ఉపయోగాలు ఉన్నాయి. అంతే గాదు వానిలో కొన్ని ఔషద గుణాలు కూడా ఉన్నాయి. అవి మీకు ఉపయోగపడాలనే భావనతో ఈ పుస్తకంలో పొందుపరచడమైనది.

1. అంజీర పండు (ఎండినది) : ఇది చలువ చేస్తుంది. జీర్ణ క్రియను మెరుగు

---

పిల్లి వలె కపటంగా ప్రవర్తించువానికి నీళ్ళయిన నివ్వరాదు.

--- మనువు.

పరుస్తుంది. కంఠమునకు, ఊపిరితిత్తులకు మేలు చేస్తుంది, శుభ్రపరుస్తుంది. పక్షవాత రోగులకు మేలు చేస్తుంది. వేడిని, అతిదాహమును అణుస్తుంది. కిడ్నీల నిస్సత్తువను, మూత్ర భద్దము మొదలగు వానిని హరిస్తుంది. నీరసమును తగ్గిస్తుంది. దీనిని పొద్దునే పరగడపున తింటే మంచిది.

2. అనాసపండు (పైనాపిల్) : ఇది చలువ చేయును. మేహశాంతినిస్తుంది. పైత్యమును అణచి పొట్టకు బలము నిస్తుంది. ఉప్పుతో కలిపి తింటే మంచిది.

3. ఆపిల్ పండు : సులభముగా జీర్ణమవుతుంది. రక్తవృద్ధి కలిగించును. వాత, పిత్త, శ్లేష్మమములను శాంతింపజేస్తుంది. రోగులు, బలహీనులు మితముగా తీసుకుంటే మంచిది. ఈ పండులో బంగారమునకు గల విశిష్ట గుణములుండును.

4. అరటి పండు : మేహశాంతి, పైత్య శాంతి కలుగజేయును. రక్తవృద్ధి చేయును. అతి ఆకలి అతిదప్పులు తగ్గించును. కాని అతిగా తీసుకొనుట వలన మూత్రములో కాల్షియం పాలును పెంచును. అయితే అరటిపండుతో పాటు దాని తొక్కలో నున్న పీచును తీసుకొనుట వలన అరటిపండు వలన హాని జరుగదు.

5. అరటి ఆకులో భోజనము : జ్వరము, క్షయ, శ్లేష్మ, వాతములను తగ్గించును. వీర్యపుష్టి కలిగించును.

6. అల్లము : అన్ని పైత్యములను హరించును. జ్ఞాపక శక్తిని బలపరుచును. కాలేయమును బలపరుచును. కడుపులోని మలినాలమ శుభ్రపరచును. అల్లము, బెల్లము సమంగా కలిపి తింటే నాలుక, అరచేతులు, అరికాళ్ల వీటిపై పొరలు ఊడడము, కొద్దిగా విరేచనాలు అగుట తగ్గును. అల్లము తినుట వలన ఈ పైన చెప్పిన సుగణాలు పొందవచ్చును.

---

పుడమిపై నరుడు కీర్తిలేక మనుటకంటే పుట్టకుండుట మేలు.

--- తిరువళ్లువరు.

7. ఆల్‌బుకారా : ఇది నోటికి రుచి పుట్టించి శరీరానికి చలువ చేస్తుంది. అతి దాహమును తగ్గించును. పరిగడుపున తీసుకుంటే విరేచనము సాఫీగా జరిగేట్లు చేయును. ఈ పండ్లతో కాచిన చారు రోగులకు ఇవ్వటము వలన పత్యము అయి నాలుకకు రుచి పుట్టించి ఆరోగ్యాన్ని ఇస్తుంది.

8. ఆవాలు : రేచీకటి, అజీర్ణము, దురదలు, దద్దుర్లు వీటిని తగ్గించును. తలలో పేలు ఉంటే ఆవాల పొడిని తలకు పట్టించాలి.

9. ఆవు నెయ్యి : రక్తపుష్టి, వీర్యవృద్ధి చేయును. పిల్లలకు, వృద్ధులకు చాలా మంచిది. ఈ నేతితో తలంటుకొంటే తలకి, కాళ్ళకు చల్లదనం కలుగజేయుటమే కాక చాలా ఆరోగ్యము కలిగించును.

10. ఉలవలు : నలుపురంగు ఉలువలు చాలా మంచివి కఫమును, శ్లేష్మమును తొలగించి మలబద్ధకమును నివారించును. కిడ్నీలోని రాళ్ళను కరిగించును. ఉలవ చారు రోగులకు చాలా మంచిది.

11.ఉసిరికాయ : ఇది కండ్లకు చలువ కలిగించును. పొట్టకు, గుండెకు బలమును, జీర్ణశక్తిని పెంచును. ఈ ఉసిరికాయలు నూరి పొత్తి కడుపు క్రింది భాగముపైన పెట్టిన మూత్రకోశములోని నొప్పిని, మంటను మానుపును. ఉసిరి పండ్ల రసమును చిక్కగా కాచి దానిని పొక్కులకు పూస్తే చర్మ రోగాలు మానును. ఎండు ఉసిరికాయ గింజలు మెత్తగా నూరి మాడకు కట్టి ఒక గంటసేపు ఉంచి ఆ తరువాత శీకాయతో రుద్దుకొనినచో మెదడులోని వేడి తగ్గించి నేత్రములకు చలవ నిచ్చును. ఉసిరి గింజల పొడిని మజ్జిగలో కలిపి సేవించిన తెల్లబట్ట తొందరగా తగును.

12. వోమ (వాము) : జీర్ణశక్తిని పెంచును. అతిసారవ్యాధి తగ్గును. కడుపు

---

పాపకర్మలన్నిటికి పక్షపాతబుద్ధియే మూల కారణం.

--- వివేకానంద.

బిగపట్టుట, కడుపులో వికారము మొదలగు వాటిని తగ్గించును. కిడ్నీలోని రాళ్ళను కరిగించును. బాలింత రాళ్ళకు పాలు పుట్టించును.

13. ఖర్బూజ : దేహమునకు చలువ కలిగించును. మూత్రాన్ని సాఫీగా చేయును. రక్తమును శుభ్రపరుచును.

14. కాకరకాయలు : వీటిలో తెల్ల, పచ్చ అనే రెండురకాలు ఉండును. తెల్లవి శ్రేష్టము. డయాబెటిస్ ఉన్నవాళ్ళు 3 కాకరకాయ ముక్కలు పరగడుపున ముందుగా సేవించాలి. దీన్ని ఉష్ణశరీరమున్న వాళ్ళు అతిగా తీసుకొన రాదు.

15.తులసి : దీని ఆకు రసము దగ్గు, వగరును బ్రాంకైటీస్‌ను తగ్గించును. ఆప్యాయము పెంచును. మనస్సుకు ఆనందము కలుగజేయును. తులసి చెట్లలోగాని వనములో గాని తిరుగుతుంటే ఆరోగ్యము ఇచ్చి రోగాలను దూరముగా ఉంచును. పండ్ల వ్యాదులు ఉన్నవారు తులసి ఆకులు నమిలితె మంచిది.

- 16. ఖర్జూరపండు : రాత్రిపడుకొనే ముందు చింతపండులాగా గుజ్జుగా పిసికి ఇవ్వటము వలన వీర్యవృద్ధి జరుగును.

17. గాజరగడ్డ : శరీరములోని వ్యవస్థలను అన్నింటిని శుభ్రపరుస్తుంది రక్తవృద్ధి కలిగించి రోగనిరోధక శక్తిని పెంచును, కఫమును తీసివేయును, మూత్రపిండములోని రాళ్ళను కరిగించును. క్యాన్సర్‌ను నిరోధించును. కళ్ళకు చాలా మంచిది. పెద్దవయస్సులో వచ్చే శుక్లాలను రాకుండ నిరోధించును.

18. గోంగూర : కాలేయమునకు బలము చేకూర్చును. మలబద్ధకము పోగొట్టును. ఇందులో ఇనుము ఎక్కువగా ఉంటుంది కావున దీనిని సేవించుట వలన రక్తవృద్ధి కలిగించును.

---

పాలుకాచనిదే త్రాగరాదు, త్రాగిన వెంటనే తాంబూలం సేవింపరాదు - కుష్టుమూత్రరోగ ప్రాప్తి.

--- భోజుడు.

19.మజ్జిగ : అలసటను తగ్గించును. రక్తములోని వేడి తగ్గించును. కాలేయములోని వేడి తగ్గించును. అధికముగా టీ తీసుకొనుట వలన కలుగు నరాల వికలత్వము పోగొట్టును.

20. రాగులు : దేహపుష్టి కలిగించును. పైత్యము తగ్గించును. వెంట్రుకలకు బలము చేకూర్చును. నరాలకు బలమును ఇచ్చును. డయాబెటిస్ ఉన్నవాళ్ళు తీసుకుంటే తగ్గును.

21.జామపండు : సులభముగా జీర్ణము చేయును. వేడి శరీరము గల వారి హృదయమునకు, పొట్టకు బలము చేకూర్చును. ఎక్కిళ్ళను పోగొట్టును.

22. జీలకర్ర : పైత్యము, కఫము, జ్వరము, రక్త అతిసారము తగ్గించును. రక్తములోని వేడి తగ్గించును. స్త్రీలలో బహిష్టు క్రమబర్చును. అధికముగా తీసుకుంటే ఊపిరితిత్తులకు మంచిది కాదు. జీలకర్ర మిశ్రి సమపాళ్ళలో చూర్ణము చేసి రోజూ 2 పూటలు టీస్పూన్ అంత 10 నుంచి 15 రోజులు తీసుకుంటే నీరసము, కాళ్ళుల పగులుట, పైత్యము తగ్గును. జీలకర్ర నిమ్మరసంతో కలిపి రోజు ఒక చెంచాడు తీసుకుంటే తలతిప్పుట కడుపు తిప్పుట మొదలగు దారుణ పైత్య రోగములు అణచును. జీలకర్ర పొడిని వేడి అన్నములో కలిపి తీసుకుంటే ఆకలి పెరుగును.

23. తేనె : ఎక్కిళ్ళు తగ్గించును. విరేచనకారి, బలముగా ఉంచును. శ్లేష్మము, దగ్గు, వగర్పులు, అతిసారము తగ్గించును నరముల యొక్క మార్గము విప్పును. దేహములోని దుష్టవస్తువులను తీసివేయును. నేత్ర రోగములను తగ్గించును. రక్తదోషము తీసివేయును. ఉష్ణము, పైత్యమేహము, మతిభ్రమ, శిరోరోగము (మైగ్రేన్లు,పార్శ్వపు తలనొప్పి) ఉన్నవాళ్ళు తేనె తీసుకొనరాదు.

---

పితృదేవ ఋషి ఋణాలు తీర్చువాడు ముక్తి పొందును.

--- గోపదేవ శాస్త్రి.

24. త్రిఫల చూర్ణము : కరక్కాయ, జాజికాయ, ఉసిరికాయపొడిల మిశ్రమమే త్రిఫల చూర్ణము. దీనిని రోజు ప్రొద్దున, సగము గ్లాసునీళ్ళలో సగం చెంచా వేసి ఆ ద్రావణాన్ని సేవించిన అన్ని వ్యాధులు హరించును.

25. దాల్చినిచెక్క : పొట్టలోని వాతమును తీసివేయును. దేహములోని అన్ని మార్గములు విప్పును. కండ్లకు కాంతి నిచ్చును. నీరసమును తగ్గించును. నరములకు సంబంధించిన తలనొప్పి తగ్గించును.

26. ధనియాలు : కడుపులో మంట, తాపమును తగ్గించును. విరేచనాలు ఆపును. పొట్టకు బలము, నిద్ర తెచ్చును. అధికముగా తీసుకొనుటవలన బుద్ధిమాంద్యము తెచ్చును. శరీరంలోని గ్యాస్ తగ్గును

27. నిమ్మ : ఆయుష్య వృద్ధిని, కాంతిని ఇచ్చును. ఆకలిని, జీర్ణశక్తిని పెంచును. పైత్యమును, వాతమును తగ్గించును. మత్తు పదార్ధముల వలన కలుగు మత్తును వదలించును. భోజనము చేసిన వెంటనే కలుగు వాంతులను తగ్గించును. నిమ్మపండ్ల రసమును ఆముదములో కలిపి శిరస్సుకు మర్ధనచేసుకున్న దుష్టవేడిమి తగ్గును.

28. పసుపు : పసుపు శ్లేష్మము, మేహము తగ్గించును. గుండెకు, పొట్టకు బలము చేకూర్చును. పసుపుకొమ్ములను నిప్పుల మీద కాల్చి నమిలిన పండ్లనొప్పులు తగ్గును. పసుపు కలిపి వేడినీళ్ళ ఆవిరి పట్టిన దగ్గు, పడిశము, తలనొప్పి తగ్గును.

29.పుదీన : వాతదోషము హరించును. పొట్టకు బలము చేకూర్చును. వాంతులు ఆపును. హిస్టీరియా తగ్గించును. దేహమును శుభ్రపర్చును. పచ్చి ఆకులు తినిన మూర్ఛవ్యాధి తగ్గును. పాలలో వేసిన విరిగిపోదు. ఈ పచ్చడి తిన్న

---

పిసినారి వలె కడుపు కట్టుకొనకయే ధనం నిల్వచేయవలెను.

--- వశిష్ఠుడు.

వికారము తగ్గును.

30. పుల్లబచ్చలి : మూత్రము సాఫీగా నుండును. బుద్ధికి బలముఇచ్చును. దీని రసము పుక్కిలించిన, ఆకు నమిలి ఉమ్మివేసిన పండ్ల నొప్పులు మాని పండ్లు గట్టిపడును.

31. బూడిదగుమ్మడి : పాండురోగము పోగొట్టును. రక్తవృద్ధి చేయును. పొత్తికడుపును శుభ్రపరచును. క్షయరోగికి ఇది ఇచ్చిన బాగుగా పనిచేయును. మేధస్సును పెంచును.

32. ముల్లంగి : అజీర్ణము పోగొట్టును. ముల్లంగి పెరుగుతో సేవించిన పైల్స్ తగ్గును. శరీరమునకు కాంతి నిచ్చును.

33. మెంతులు : మొలకలు రోజు పెసర మొలకలతో కలిపి తింటె చెక్కెర వ్యాధి తగ్గును. రక్తపోటు, గుండెజబ్బులు ఉన్నవారికి ఉపశమనం కలిగించును.

# ధ్యాని అంటే ఎవరు

పిల్లల లాంటి పెద్దల సంఘములో జీవితకాలము సభ్యులనియు
మరియు ఎల్లప్పుడు హాయిగా

వానల్లో తిరుగుతూ, బురదలో దుముకుతూ, ఇంద్ర ధనస్సులు చూస్తూ, పూలవాసనలు ఆస్వాదిస్తూ, బుడగలు చేస్తూ, దారివెంట ఆగుతూ, ఇసుక గూళ్ళు కడుతూ, నక్షత్రాలను, చంద్రుణ్ణి చూస్తూ, అందరిని హలో అని పలకరిస్తూ, చెప్పులు లేకుండా తిరుగుతూ, సాహసాలు చేస్తూ, వానలో పాడుతూ, ఉల్లాసవంతమైన హృదయము కలిగి చిన్నపిల్లల పుస్తకాలు చదువుతూ, సిల్లీగా ఉంటూ, కొత్తవాళ్లతో స్నేహము చేస్తూ, అందరితో చేతులు కలిపి, అందరిని హృదయానికి హత్తుకుంటూ,

---

పుట్టినవన్ని నశించును. నశించేవన్ని దుఃఖము నిచ్చును.

--- గౌతమ బుద్ధుడు.

ముద్దాడుతూ, నాట్యము చేస్తూ, గాలి పటాలు ఎగురవేస్తూ, ఆరోగ్యంగా నవ్వుతూ, ఏడుస్తూ, సంభ్రమాశ్చర్యాలతో ఉంటూ, భీతి చెందుతూ, దిగులుగా ఉంటూ, చింతలను, తప్పు అనే భావనను, సిగ్గును వదిలి వేస్తూ అమాయకముగా ఉంటూ, అవునంటూ, కాదంటూ, అర్థము లేని మాటలంటూ, ఎన్నో ప్రశ్నలు వేస్తూ, సైకిల్ తొక్కుతూ, బొమ్మలు గీస్తూ, అన్ని కోణాల్లో నుంచి చూస్తూ, పడిపోతూ, మళ్ళీలేస్తూ, జంతువులతో మాట్లాడుతూ ఆకాశము కేసి చూస్తూ, విశ్వాన్ని విశ్వసిస్తూ, రాత్రిళ్ళు లేటుగా పడుకుంటూ, చెట్ల కింద ఎగురుతూ, దిండ్లతో కొట్టుకుంటు క్రొత్త, కొత్ర విషయాలు నేర్చుకుంటూ అన్నింటి పట్ల ఆసక్తి చూపుతూ, సంగీతము వింటూ, అన్నీ ఎలా పని చేస్తున్నాయో తెలుసుకుంటూ, కథలు, చెప్పుతూ, ప్రపంచాన్ని కాపాడుకుంటూ తనవాడలోని ఇతర పిల్లలతో స్నేహము చేస్తూ ఉండటమే కాకుండ అమితానందము, వేడుక, విశ్రాంతి, సంబంధ భాంధవ్యాలు, సంతోషము, సృజనాత్మకత, సుఖము, సమృద్ధి, సొగసు, సమత్వము, ఆరోగ్యము, ప్రేమ, మనోభావము, అందము, శాంతము మరియు జీవశక్తి అనేవి తనకే కాకుండ ఈ భూమిపై ఉన్న సకల మానవులకు, జీవరాసులకు అధికముగా కలిగించడము కోసము ఏమైన చేయటానికి ఎల్లప్పుడు సర్వహక్కులు కలిగి ఉన్నారు.

అంతే కాకుండ ఈ పైన పేర్కొన్న సభ్యుడు అన్ని వయస్సుల చిన్న పిల్లలు వచ్చి ఆడుకొనే స్థలాలైన బీచులు, అడవులు, ఆటస్థలాలు, పిక్‌నిక్ స్థలాలు, వేసవి శిబిరాలు, పుట్టినరోజుపార్టీలు, సర్కసులు, బేకరీదుకాణాలు, ఐస్‌క్రీమ్‌షాపులు, సినిమా హాళ్ళు జలాశయములు, జంతుప్రదర్శనశాలలు, మ్యూజియంలు, నక్షత్రశాలలు, బొమ్మల దుకాణాలు మొదలగు వాటన్నింటికి తరచుగా వెళ్ళి ఆనందించటానికి సంస్థాపరముగా అధికారమివ్వబడినది. పిల్లలు లాంటి పెద్దల సంఘము యొక్క ఆశయాన్ని సదా గుర్తు తెచ్చుకొనేటట్లు ప్రోత్సహించడమైనది.

ఆనందకరమైన బాల్యమునకు ఇంకా సమయం మించిపోలేదు.

---

పుణ్యకర్మలు చేయుచు నూఱేండ్లు జీవింపవలెనని కోరుకో.

--- మనువు

# సంగీతము -ఆరోగ్యము

ఆరోగ్యముగా మనిషి ఉండుటకు సమతుల్యమైన ఆహారము, వ్యాయామము, ధ్యానమే కాకుండ మనిషి యొక్క మానసిక-శారీరక స్వస్థతకు ఉల్లాసమునకు సంగీతము పాత్ర కూడా చాలా ఉన్నది. సంగీతము మనకు వినబడగానే చిన్న పెద్ద తేడా లేకుండా పారవశ్యములో తేలియాడుతాము. ఆ పారవశ్యమే మనిషి యొక్క ఆరోగ్యము, ఆనందానికి కారణము.

నేడు సంగీతము ద్వారా చాలామంది ఉదా॥ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ ఎన్నో వ్యాధులనుండి మనుషులకు విముక్తి కలిగించుచున్నారు. శ్రావ్యమైన సంగీతము విన్నపుడు మనస్సుకు ప్రశాంతత చేకూరి మనలోని Tensions వాటంతట అవే తొలగి సమత్వమును చేకూర్చుతుంది. సంగీతము యొక్క శక్తి గురించి పురాణ ఇతిహాసాల్లో మనమెన్నో తెలుసుకున్నాము. సంగీతము ద్వారా మొగ్గల్ని వికసింపజేసినవారు, పండ్లను కాయించిన వారు, గోవులు పాలు ఇచ్చేటట్లు చేసిన మహానుబావులు ఎంతో మంది ఉన్నారు. శిలలను కరిగించిన తాన్‌సేన్ వంటి సంగీత విద్వాంసులను గురించి మనకు తెలిసిందే. శ్రావ్యమైన సంగీతములో ఎటువంటి నొప్పి కూడా కలుగని శస్త్రచికిత్సలు జరిగాయి. వీణానాదము వినిపించుట వలన ఎంతో మంది గర్భిణి స్త్రీలకు సుఖవంతమైన ప్రసవాలు జరిగినాయి.

శారీరక ఆరోగ్యము ఆరోగ్యవంతమైన మనస్సు యొక్క ప్రతిఫలము. ఇది లోక విదితము సరియైన సంగీతము నరాలను విశ్రాంతి స్థితికి తెచ్చి శాంతము ప్రసాదిస్తుంది.

పతాంజలి యోగ సూత్రాల ప్రకారము మన శరీరములో 14 ప్రధాన నాడులు 72,000 ప్రాణ నాడులు ఉన్నాయి. ప్రతి నాడికి ప్రత్యేకమైన ప్రకంపనాలు ఉన్నాయి. సంగీతము ఈ నాడుల పైన ప్రభావము చూపించి ఆధ్యాత్మిక శక్తి అందేలా చేస్తుంది.

పుణ్యఫలం కోరెదవేని పాప ఫలం అనుభవింపవలసినదే.

--- బృహదశ్వుడు.

# భజన అంటే

భజన యన్నది భగవత్పారవశ్యాన్ని ఆస్వాదించే ఒక ప్రత్యేక భావం. మహాభక్తులు తమ పారవశ్యంతో జనుల హృదయాలను కదిలించి పునీతం చేశారు. వీచే గాలి ఏ విధంగా నైతే పుష్పసుగంధాలను ప్రసరింప జేస్తుందో, అదే విధంగా భజనలు వారి భక్తి పరిమళాలను వ్యాపింపజేస్తాయి.

ఆ మహాభక్తుల నుండే జనించిన భజనలను, కీర్తనలను విన్నవారు ఉన్నారు ఆకీర్తనలను విన్నప్పుడెల్లా హృదయాలు స్పందిస్తున్నాయి. ఆభక్తునితో, ఆభక్తి పారవశ్యంతో అను సంధానం చేస్తూ, భజనలు మీలోని పరిపూర్ణతకు ప్రతిబింబాలు ధాన్యం పరిపూర్ణతకు అత్యంత సులువైన మార్గం ధ్యానించండి, పరిపూర్ణత నొందండి.

మీలోని ఈ పరిపూర్ణతయే జీవధారగా భజనలకు నాంది పలుకును గాక! ప్రతి ఒక్కరిలోను దైవత్వం వికసించనీగాక ! విశ్వమందంతటా శ్రద్ధాభక్తులు తొనికిసలాడనీ గాక !

భజన అజరామరమైన ఆనంద ప్రహేళిక. భజన భవ్యగుణ సుజణ సుమాలిక. భక్తి భావనం మహాత్ముల సత్ సేవనానికి దారి తీసే విజయ సోపానం. ధ్యానం మనిషిని అనంత సాగర నిహారికల తేలించే అనుభూతి అరోహణం. ధ్యానం వేదవేదాంగు ఉపనిషత్తు సార పారాయణం. ఒకొక్క భక్తి గీతం ఉత్తుంగ తరంగ మల్లే జాలువారే జలపాతం. ఒక్కొక్క భక్తిగీతం పున్నమి నాటి చందమామ అందించే వెన్నెల రెక్క--- ఒక్కొక్క భక్తి గీతం హృదయాన్ని కదిలించే, కరిగించే మంచుముక్క.

# చిన్న చిన్న క్రిష్ణయ్య

కరార విందేన - పదార విందం

ముఖార విందేన - వినివేశయంతం

వరస్య పత్రస్య - కుటీశయానం

---

పుణ్యాత్ముడైనా కావలె, లేక నిరహంకారి యైనా కావలె.

--- వినోబాభావే.

బాలం ముకుందం మనసాస్మరామీ

1) చిన్ని చిన్ని కృష్ణయ్య చిన్నారి కృష్ణయ్య
చిలిపి చిలిపి కృష్ణయ్య మా చిన్నారి కృష్ణయ్యా ॥2॥
బృందావన గోపి కృష్ణా వేణుగాన లోల కృష్ణా - నీలమేఘశ్యామ
కృష్ణా నిరుపమ గుణ ధామ కృష్ణా ॥2॥
గోపాల బాల కృష్ణాగోవిందలోల కృష్ణా - గోపిజన హృదయ కృష్ణా
గోవర్ధనాధారికృష్ణా ॥2॥
॥ చిన్ని చిన్ని ॥

కోదండ రాముడట రామయ్య
కోవెల్లో వెలిసేనట రామయ్య
కౌసల్య తనయుడట కారుణ్యధాముడట ॥ కోదండ
పంకజ నయనుడట పన్నగ శయనుడట ॥2॥
పావన రాముడట పట్టాభిరాముడట ॥ కోదండ
భాసుర రాముడట భద్రాధి రాముడట ॥ 2 ॥
అయోధ్య రాముడట ఆనంద రాముడట కోదండ
శంభో శంకర మహాదేవా - సాంబ సదాశివా గౌరీశా ॥2॥
దేవా దేవా - మహాదేవా దేవా ॥2॥
విభూతిశంకర - త్రిశూలధారి
చిదంబరేశ - ఉమామహేశా
దేవాదేవా - మహదేవా దేవా ॥2॥
గంగాధర హర గౌరీ వల్లభ
ఢమ ఢమ ఢమ ఢమ ఢమరూనాధ
దేవా దేవా - మహాదేవా దేవా ॥2॥

పూర్తిగా సంసారపుటడుగున మున్గి దేవుని మఱచు వాడు మలకీటకం వంటివాడు.

--- రామకృష్ణ పరమహంస.

||శంభో శంకర||

2) రాధే కృష్ణా గోవింద రాధే కృ
రాధే కృష్ణా గోపాల రాధే కృ
రాధేకృష్ణ గోవింద రాధే కృష్ణ గోపాల
రాధేకృష్ణ ముకుంద రాధే కృష్ణ మురారీ ||రాధేకృష్ణా ||
జయగోవింద జయనందలాల రాధాలోల హరి గోపాల
త్రిభువనపాల సరి సిజలోల
సూరధాసప్రభు గిరిధరలాల ||రాధేకృష్ణా||
మీరాకే ప్రభు మురళీలోల భక్తసఖా ప్రభు నందగోపాల
నందకుమార నవనీత చోర
గోపి మనోహర వేణుగోపాల ||రాధేకృష్ణా||

3) శంకర శివ శంకర శివ శంభోమహదేవ శివ ||2||
హర హర శంభో శివ శివ శంభో ||2||
గంగాధర హర గౌరి మనోహర
భక్తావత్సల భవాని శంకర
జయ జయ శంకర జయ పరమేశ్వరా ||శంకరశివ||
నందీవాహన నాగాభూషణ
మంగళ శుభచరణ మృత్యుంజయా
జయ జయ శంకర జయ జగదీశ్వరా ||శంకరాశివ||
నీరజ దళనేత్ర నీలా కంఠశివ
నిరుపమ గుణశివ నటరాజశివా
జయ జయ శంకర జయ అభయంకరా ||శంకరాశివ||
హర హర శంభో శివ శివ శంభో ||3||

---

పెక్కుమాటలు పల్కువాడు పండితుడు కాడు, ధర్మపోషకుడు కాడు.

--- గౌత[illegible]

4) సలామాలేకం వాలేకుం సలామ్ ॥3॥

లాహి లాహియిల్లిల్లా మహమ్మదు రసూలల్లా ॥3॥

ఓం నమఃశ్శివాయ శ్శివాయనమః ఓం ॥3॥

మేరీ తనయా ఏసుప్రభూ

హల్లెలూయా హల్లెలూయా

మేరీతనయా ఏసుప్రభూ

బుద్ధం శరణం గచ్ఛామీ

ధర్మం శరణం గచ్ఛామీ

సంఘం శరణం గచ్ఛామీ

స్వామి శరణం గచ్ఛామీ ॥సలామాలేకుం॥

5) నంద నందన నవనీత చోర గోపాల

బృందావన లోల గోవింద గోపాల

గోపిలోల గోకులబాల ॥2॥

॥నంద నందన॥

మాధవ మురహర మధుర మనోహర

మంగళ గిరిధర మంగళ దాయక

మురళీలోల మునిజన పాల ॥2॥

॥నంద నందన॥

గోపీజనప్రియ గోకుల రమణ

గోవర్ధనధరా గోపరి పాల

రాధాలోల రాసవిలోలా ॥2॥

॥నంద నందన॥

గోపిలోల గోకులబాల ॥8॥

---

పెడసరం పరుసదనం విడిచినగేస్తు సర్వులను లోబర్చుకొనును

--- యజ్ఞవల్క్యుడు.

6) నల్లా నల్లాని వాడు నామంబు గల్లవాడు ||2||

నామంబు గల్లవాడు ||2||

నాసామి యేలరాడే గోవింద గోపాలుడే ||2||

మా మంద పాలు తాగి యేమంద కేగినాడొ ||2||

యే మందకేగి నాడో ||2||

కనులకు కనరాడే గోవింద గోపాలుడే ||2||

మా యింటి ఉట్టి మీది వెన్నను దొంగిలించి ||2||

వెన్నను దొంగిలించి ||2||

యే యింట్లోదాగి నాడో గోవింద గోపాలుడే ||2||

గోవిందుడే గోపాలుడే మన కోరికలను తీర్చేటి కోమలాంగుడే

మన కోరికలను తీర్చేటి కోమలాంగుడే ||2||

రాధారమణ మదన మోహన బృందావన చిన్ని కృష్ణ ||2||

||గోవిందుడే||

7) ఓం గురునాధ

శ్రీ గురునాధ

ఓం గురునాధ జయ గురునాధ శ్రీ గురునాధ సద్గురునాధ ||2||

చిన్మయ రూపా సద్గురునాధ

శాంత స్వరూపా సద్గురునాధ ||చిన్మయరూపా||

అనాధ నాథ ఆనందరూపా ||2||

అద్భుత చరిత సద్గురునాధ ||ఓం గురునాధ||

దీనోద్ధార దీన దయాళో

దివ్య స్వరూపా సద్గురునాధ ||దీనోద్ధార||

జయ గురునాధ హరి గురునాధ ||2||

---

పెద్దల దర్శన మయినపుడు వాహనము నుండి దిగవలెను.

శివ గురునాధ సద్గురునాధ ॥ఓం గురునాధ॥

శ్రీ గురునాధ సద్గురునాధ ॥6॥

8) నీవనుచు నీవైతినీ - పరమాత్మ నినుజూచి నీవైతిని

పరమాత్మ నినుజూచి నీవైతిని ॥2॥

భ్రమరమ్మునిరతమ్ము భావించి కీటకము ॥2॥

తానేభ్రమరమ్ముగా తనువు మారిన యెట్లు ॥2॥

॥నీవనుచు॥

సర్వ సుందర రూపా సాకృతి నిరాకారా ॥2॥

అనుభవపు ముకురమ్ము నన్నున్న నానీడ ॥2॥

॥నీవనుచు॥

ప్రేమమయ జపమాలలో మధుర మైననీ ॥2॥

నామమ్ము సతతమ్ము నీమనమున జపియింప ॥2॥

॥నీవనుచు॥

## రాగ మోహన

1. వేదాంత వీధుల్లో విహరించే గిరిధారి

యేదిర నీ మురళి ఊదర ఒకసారి

ఊదర ఒకసారి ॥వేదాంత॥

పండు వెన్నెలరేయి ప్రణవనాదమే హాయి ॥2॥

నిండు వెన్నెల దోయి నిర్మల సుఖదాయి ॥2॥

॥వేదాంత॥

యెందు దాగి ఉన్నావో యె వాడ నున్నావో ॥2॥

అందముగ నామ్రేల ఆడర గోపాల ॥2॥

॥వేదాంత॥

---

పెద్దలమాట తలదాల్చువాని కేయాపదలు కలుగవు.

--- శంకరాచార్యులు.

నంద గోకుల బాల నారద మునిలోల ॥2॥
సాంద్రసుగుణ జాల శాంత మానస చోర ॥2॥ ॥వేదాంద॥
కృష్ణా రారా రావేల నంద కిశోర రా (2)
రాధ నోయీ నీ రాధ నోయీ (2)
బృందావనిలో నీ కోసం రాధ నోయీ
రేపల్లేలో అందాల రాధను నేనోయీ ॥బృందావనిలో॥
॥ కృష్ణా రారా ॥

నంద కిశోర నవనీతచోర రాధనోయి
ద్వారక నాథ నీ ముద్దు రుక్మిణి నేనోయీ ॥బృందావనిలో॥
। కృష్ణా రారా ॥

మధురానగరిలో మదురమైన భావన నేనోయి
మురిపాల నీ సత్యభామను నేనోయి ॥మధురానగరి॥
కృష్ణా రారా ॥

రాధనోయి నీ రాధనోయి (2)
॥ నీ రాధనోయి॥

3. రామయ్య ఓ రామయ్య (2)
మమ్మ కావగ రావేమయ్య
యెంత వేడిన గాని మాపై - కొంతైనా దయరాదా (2)
ఓ రామయ్యా......... ఓ రామయ్యా
దీన దయాళుడ ఓ రామయ్య - నిన్నేనమ్మితినో రామయ్య (2)
మా పాలి దేవుడవని నిన్ను - కొలిచి మొక్కతి వో రామయ్య (2)
ఓ రామయ్య ............ ఓ .... రామయ్యా ॥ఓ రామయ్య॥
పుణ్యము చేసితి మొ రామయ్యా - పలుకరించగ రా వేమయ్యా(2)

---

నీవేదిక్కని నమ్మితిమి - మమ్ము బ్రోవగరావేమయ్యా (2)

రామయ్యా ...............ఓ......రామయ్యా ॥ఓ రామయ్యా॥

॥యెంత వేడిన గాని మాపై కొంతైనా దయరాదా॥

4. రంగ రంగ పండరినాథ విరలా

పాండు రంగా హరి విరలా - పండరి నాథా జయ విరలా (2)

( రంగ రంగ)

బ్రహ్మానందా భజగోవిందా భక్త పోషకా పాండురంగా

పుండరీక పురందర విరల పరమ పురుషా పాండురంగా

విరల విరలా పాండురంగా (పాండు రంగా)

నిత్యానంద నిర్గుణకంద పరమానందా పాండురంగా

సాధువిలోల సరసిజపాద పావనాంగ పాండురంగా

విరల విరల పాండురంగా (పాండు రంగా)

॥రంగ రంగా హరే పాండురంగా హరే॥ (రంగా రంగా)

5. మాధవా... .

మంజుల మోహన రూపమా

మధురోహన మాధురి ముకురమా............! ॥మాధవా॥

మాధవా......

యెదలోని రాధను రాగమ్ముగా చేసి

మోవిపై మురళి లో గానముగా మలచి ॥యెదలోని॥

బృందావనిలో కేళీవనిలో (2)

రసమయ జగతిలో ఓల లాడితివి (2) ॥మాధవా॥

యమునా తరగలా నెలరాజు నవ్వా

పెద్దలను పనులందు నియోగింపరాదు - నిందింపరాదు.

--- భీష్మాచార్యులు.

చిరుగాలి కెరటాల మరుమల్లె నవ్వా యమునా॥
మదన చేష్టలకు పొదరిళ్ళునవ్వా.... (2)
రసమయ జగతిలో ఓల లాడితివి (2)
మాధవా. ...........

6. వనమాలీ..... బృందావనమాలీ (2)
గోకుల నందన కృష్ణ మురారీ (2)
వనమాలీ.... ....ఆ..........ఆ.......ఆ........
కేశవ మాధవ హరి మధుసూధనా (2)
మురళి మనోహర మదన మురారీ (2) ॥వనమాలీ॥
దేవకి నందన నంద కిశోర (2)
గోపి జనప్రియ హృదయ విహారీ (2) ॥వనమాలీ॥
రాధా మాధవ మేఘ శ్యామ (2)
మానస చోర గోకుల ధామా (2)
మధువన సంచారీ మురళీ ధారి (2)
సత్య స్వరూపా మీరా ప్యారీ (2)
విశ్వా. ... ధారి ॥రాధా మాధవా॥

7. జయదే - జగదానందే
జగదేక ప్రపూజితే
జయ సర్వగతే
దుర్గే..........జగద్ధాత్రి నమోస్తుతే (2)
జగదీశ్వరీ జయ మాతా భవానీ (2)
కారుణ్య లావణ్య అఖిలాండేశ్వరీ ॥జగదీశ్వరీ॥
త్రైలోక్య జనని ఆనంద రూపిణీ (2)

పెద్దలు లేని సభయందు ప్రవేశించుట పాపహేతువు.

--- విదురుడు.

హే శివ శంకరి త్రిలోక పాలిని మాతా (2)
కరుణా మాయీ పరిపాలిని మాత (2) ॥జగదీశ్వరీ॥
హంసావాహిని దేవీ అమ్మా సరస్వతీ (2)
వీణా వాదినీ (2) మయూర వాహిని
విశ్వరూపిని కాళీభవాని (2) ॥జగదీశ్వరీ॥
॥ జగదీశ్వరీ॥ (3)
శరణం శరణం మంటూనప్పుడు కరుణ జూపుమయ్యా
నీ శరణం నామ మంటున్నప్పుడు కరుణ జూపుమయ్యా
నీ శబరిమల ఎక్కేటపుడు కరుణజూపుమయ్యా
మము ఆదరించి కాపాడి కరుణ జూపుమయ్యా
అనాధ రక్షక కరుణ జూపుమయ్యా
తల్లి తండ్రి అన్ని నీవే కరుణ చూపుమయ్యా
మా తల్లి తండ్రి అన్ని నీవే కరుణ చూపుమయ్యా
శరణం శరణం అయ్యప్పా
"స్వామి శరణం అయ్యప్పా"

## అమృతధార

ప్రణమ్య శిరసా దేవం
గౌరీపుత్రం వినాయకం
భక్తా వాసం స్మరేనిత్యం
ఆయుకామార్థ సిద్ధయే !!

1 వినాయకా .........వినాయకా (2)
ధారా వినాయకా ॥ వినాయకా

పై బట్టను పంచెగా, పంచెను పై బట్టగా దాల్చరాదు.
--- వేదవ్యాసుడు.

ఆనాధా రక్షక ఆనంద దాయకా (2)
ఉమామహేశ్వరా హేప్రియనందన ॥ వినాయకా
సిద్ధి వినాయకా భవ భయహరణ (2)
సురముని వందిత శ్రీ గణేశా ॥ వినాయకా ॥
వినాయకా వినాయకా (5)

(2) రామం రామం రఘు రామం (2)
భక్త కల్పతరు హరినామం రామం రామం ॥
భార్గవ రామం తారక నామం
సత్య నిరంజన జ్ఞానావతారం ॥బార్గవ ॥
జ్ఞాన నిరంజన జ్ఞానావతారం
ధర్మ నిరంజన ధర్మావతారం ॥ రామ రామం ॥
కేశవ మాధవ హరినారాయణ
మానస భూషణ మానసవంజన ॥ కేశవ ॥
భక్తవత్సలా భాగవతాప్రియ
భద్ర గిరీశా సీతారామం ॥ రామం రామం
3) నారాయణ హరినారాయణా
నారాయణ లక్ష్మీనారాయణా నారాయణ॥
దీనార్ధి హరణ నారాయణా
త్రిభువన భరణా నారాయణా॥ దీనార్ధి॥
కారణ కారుణ నారాయణా
కారుణ భరణా నారాయణా ॥ నారాయణ ॥
పావన చరణ నారాయణా

---

పెనుగాలిచే నెగర గొట్టబడు పులి విస్తరి వలె గర్వం విడిచి యుండు.
--- రామకృష్ణ పరమహంస.

పాప నివారణ నారాయణా ॥ పావన ॥

పద్మారమణా నారాయణా

భవ భయ హరణా నారాయణా ॥ నారాయణా ॥

లక్ష్మీనారాయణా - లక్ష్మీనారాయణా (7)

4) శ్రీరామ జయరామ జయజయ రామ

జయ సీతారామ జయ జయ రామ ॥ శ్రీరామ ॥

చారు సుందర రామ జానకి రామ

కోదండ రామ కారుణ్యధామా ॥ 2 శ్రీరామ ॥

దశరథరామ ఓంకారరామా ॥ 2 ॥

పావన రామా పట్టాభి రామ ॥ 2 ॥ శ్రీరామ

॥ జయరామా జయరామ ॥

5) ఓ నమః ప్రణవార్థాయా

శుద్ధ జ్ఞానైక మూర్తయే

నిర్మలాయ ప్రశాంతాయా

దక్షిణా మూర్త యేనమః

జయ జయ శివ శివ జయ జయ హరహరా

జయ జయ శంభో జయ గంగాధర । జయ జయ శివ

జయ మదనాంతక జయ త్రిపురాహర (2)

జయ మృత్యుంజయ జయజయ భవహర (2)

॥జయ మదనాంతక॥

॥జయ జయ శివ శివ॥

జయ జయ శశిధర జయ పరమేశ్వరా

జయ శాంభవిప్రియ జయ సాంబశివ (2)

పేదలను, వికలాంగులను గేలిచేయువారు భావిలో వారి గతులు పొందుదురు.

--- చిరంతనానంద స్వామి.

॥ జయ జయ శశిధర ॥

॥ శంభో పాహిమాం ॥ ॥ జయ జయ శివశివ ॥

6) శ్రీ రాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్మయ రత్నదీపం
ఆజాను బాహుం అరవింద దళాయ తాక్షం
రామం నిశాచరం వినాశకరం.
నమామీ ........
శ్రీ రామ రామ పాహి రఘు రామ రామ పాహీ ॥2॥
కోదండ రామ పాహి సాకేతరామ పాహీ ॥2॥
॥ శ్రీ రామ ।
ఆనందరామ పాహీ అయోధ్య రామా పాహీ
అర్ధి నివారణ పాహీ ఆశ్రిత రక్షక పాహీ
॥ శ్రీ రామ ॥ ॥2॥
దశరధ నందన పాహీ దైత్యకులాంతక పాహీ
పతిత పావన పాహీ పరమదయాకర పాహీ
॥ శ్రీ రామ ॥ ॥2॥
జయ రఘునందన పాహీ జానకి రమణా పాహీ
శాంత సుగుణ ధన పాహీ శాంతి ప్రదాయక పాహీ
॥ శ్రీ రామ ॥ ॥2॥

(7) ఓ బొజ్జ గణపయ్య నీ బంటూ నేనయ్య
ఉండ్రాళ్ళ మీదకి దండు పంపూ గణపయ్యా
కమ్మని నెయ్యి కడు ముద్ద పప్పు గణపయ్యా

పాపక్షయమైనపుడే పరభక్తి ముక్తి కలుగును.
--- శాండిల్యుడు.

వెండి పళ్ళెంలోన వేల వేల ముత్యాలు
కొండలుగ నీలాలు కలియ బోసి పెట్టాము
మెండుగా హారాలు మెడలోన వేసుకొని
దండిగ నీకిస్తాం దవళ హారతులు

॥ ఓ బొజ్జ గణపయ్య

నేరేడు మారేడు నెలవంక మామిడి
దూర్వార చంగల్వ ఉత్తరేణువు తెచ్చాము
పానకం వడపప్పు పనసా మామిడిపళ్ళు ॥2॥
దానిమ్మ కర్బూజ ద్రాక్ష పళ్ళు తెచ్చాము

॥ ఓ బొజ్జ గణపయ్య ॥

శ్రీ శంబు తనయునకు సిద్ధి గణ నాథునకు
వాసి గల దేవునకు ముల్లోక పూజ్యునకు
మంగళం మంగళం మార్తాండ తేజునకు ॥2॥
మంగళం మంగళం మహితా సంచారునకు

॥ ఓ బొజ్జ గణపయ్య ॥

8) నందలాల యదు నందలాల
బృందావన గోవింద నందలాల ॥నందలాల॥
రాధా లోలా నందలాల
రాధా మాధవానందలాల ॥ రాధాలాల ॥
మురళి మనోహర నందలాల ॥ నందలాల ॥

గోపాల క్రిష్ణా నందలాలా
గోపిక నాథా నందలాలా గోపాల ॥

పాపితో వత్సరకాలం చెలిమి చేసినవాడు, వాని వద్ద దానం పట్టిన వాడు, కలిసి తిన్నవాడు పతితుడగును.

--- నారాయణభట్టు.

ఆనంద బాలా నందలాలా ॥ నందలాలా

గోవింద కృష్ణా నందలాలా
గోపాల బాలా నందలాలా ॥ గోవింద ॥
మునిజన వందిత నందలాలా ॥ నందలాలా
బృందావన గోవిందా ॥ నందలాలా ॥

(9) గోవింద గోపాల హే నందలాలా ॥2॥
రాధే గోపాలా గోపీ గోపాలా ॥2॥ ॥ గోవిందా ॥
మీరాకే నాథ్ ప్రభు గిరిధర్ గోపాలా ॥2॥
గోవర్ధనోద్ధార గోపాల బాల ॥2॥
రాధే గోపాల గోపి గోపాల ॥2॥ ॥ గోవింద ॥
॥రాధే గోపాల గోపి గోపాల ॥

(10) చిన్ని చిన్ని నడక నడిచి పారిరావా కృష్ణా పారి రావా ॥2॥
నీ చిన్నారి నోరు విప్పి పలుకు పలకవా కృష్ణా పలుకు పలకవా
పలుకు పలకవా కృష్ణా పలుకు పలకవా ॥2॥
॥ చిన్ని చిన్ని ॥
సత్య ధర్మ శాంతి ప్రేమ చాటి చెప్పవా కృష్ణా ॥2॥
చాటి చెప్పవా కృష్ణా చాటి చెప్పవా ॥ చిన్ని చిన్ని ॥
ఓంకార మందిరమున నిండి యుందువా
కృష్ణా నిండి యుందువా
నిండి యుందువా కృష్ణా నిండి యుందువా ॥ చిన్ని చిన్ని ॥

---

ంలు ప్రతిక్షణము చచ్చుచుందురు. ధీరోదాత్తు డొక్కసారియే.
--- షేక్స్పియర్.

(11) యదుకుల తిలకమే యాదవ రత్నమే ॥2॥
మాధవ గోవింద మధు సూదన ॥2॥
మధుసూదన మన మోహన
మన మోహన యదునందన ॥ మధుసూధనా ॥
మన్మధ జనక మహలక్ష్మి వల్లభ ॥2॥
మాధవ గోవింద మధుసూదనా ॥2॥
॥ మధుసూధనా ॥
మాయవతార హే మాయ గోపాల ॥2॥
॥ యదుకుల ॥
॥ మధుసూధనా మనమోహన ॥ ॥6॥

(12) గోపాల బృందావన బాల
గోపీలోల గోకుల బాల ॥ గోపాల ॥
మురళీ లోల మునిజనపాల ॥2॥
సురముని వందిత గోపాలా ॥ గోపాల ॥
రాధా లోల రమ్య సుశీల ॥2॥
రాధిక వనమాల గోపాలా ॥ గోపాల ॥
వేణు విలోల విజయ గోపాలా ॥2॥
ఆగమమూల గోపాలా ॥ గోపాల ॥
నంద కిశోరనవనీత చోర
మంజుల భాష మణి మయ భూష గోపాల
॥ గోపాల బృందవన బాల ॥

## గోవిందా

పుత్రవంతుడు తనయిం ఉత్తరముఖంగా భుజించుగూడదు.

--- నారాయణభట్టు.

గోవింద యనరా గోపాల యనరా
రాం రాం అనరా హరినామ మనరా ॥ గోవిందా ॥
అల్లా మాలిక్ ఏసు నానక్ ॥2॥ అల్లా అక్బరు ......... అల్లా
జోరాష్ట్ర మహ వీర బుద్ధనామ మనరా
బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి ॥ జోరాష్ట్ర ॥ గోవింద॥
సర్వం తానైన ఆతని పేరు ॥2॥
పిలిచిన చాలు పలుకును తాను
ఏ పేరునైన ప్రేమతో అనరా ॥2॥
భక్తితో అనరా భావనతో అనరా ॥ గోవిందా ॥
॥ రాం రాం అనరా హరినామ మనరా ॥

(2) యెంకన్న సామి దండాలో ..............................
తిరుపతి యెంకన్న సామి దండాలో ..............................
సామి సామి సామి దండాలో యెంకన్న సామి దండాలు
ఆపద మొక్కుల వెంకన్న సామి
ఆదరించేవాడ యెంకన్న సామి
అలువేలు మంగమ్మ ఆ ఆ ..................................
ఆకాశ గంగమ్మ ఓ.....ఓ ................................
అలువేలు మంగమ్మ ఆకాశ గంగమ్మ .................
ఒదిగింది అగుమ్మా పద్మావతి అమ్మా ॥సామిసామి॥
వడ్డీ కాసుల వాడ యెంకన్న సామి

పూవు వయసులోని కోరికను పెంచి పెద్దచేసే దాదియే ఆశ.
--- బికర్‌స్టాఫ్.

వరద ప్రదాత యెంకన్న సామి ॥ వడ్డీ కాసులు ॥
కొండల్లో నిండైన ఆ ఆ
కోనేటి శీనన్న ఓ ఓ
కొండల్లో నిండైన కోనేటీ శీనన్న
నిండుగుండగ నీకు దండ మెట్టెదమన్నా ॥ సామి సామి ॥
కొలిచిన వారికి యెంకన్న సామి
కొంగు బంగారమౌ యెంకన్న సామి ॥ కొలిచిన ॥
వేడిన వారివి ఆ..... ఆ...............................
కోర్కెలు తీర్చేవు ఓ.....ఓ...........................
కోరిన వారివి
కోర్కెలు తీర్చేవు
వేడినవారివి వేడ్కెలు తీర్చెవు
కోరిన వారిని కోర్కెలు తీర్చేవు ॥ సామి సామి ॥
॥ సామి సామి దండాలు యెంకన్న సామి దండాలు ॥

దండాలు దండాలంటా ఓ రామయ్యా
దయగల్ల దేవుడివంటా రఘు రామయ్యా
సీతమ్మకు ప్రాణమంటా ఓ రామయ్యా
శ్రీ రామ చంద్రుడి వంటా ఓ రామయ్యా దండాలు ॥2॥ దండాలు॥
కౌశికుని యాగంబు కాచిన దొరకి --- హో ---
రాతిని నాతిగా చేసిన దోరకి --- హో ---
శివ ధనస్సు శివమెత్తి విరిచిన దొరకి --- హో ---
సీతా మాతను పెండ్లి ఆడిన దొరకి --- హో ---
భక్తుల దండాలు బాపుము గండాలు

---

పొట్టకూటికై ఆరాట పడకు - నొసటి వ్రాత తప్పదు.
--- విదురుడు.

బొండు మల్లెల దండలు అల్లగ దండాలు దండాలు ॥2॥ దండాలు

తండ్రి మాటనే తల దాల్చిన తండ్రి ॥హో॥

తమ్ముల ప్రేమకు భాష్యం పలికిన తండ్రి ॥హో॥

ఆవాలిని వధియించిన వన్నెల తండ్రి ॥హో॥

రావణున్ని చంపేసిన రవికుల తండ్రి ॥హో॥

దిక్కే నీ వంటా మొక్కేనీకంటా ॥2॥

దీనుల పాలిట దివ్వెవునీవై ఎలగాలి మాయింట ॥2॥ దండాలు ॥

(4) భజో భజో గురు భజనం

భజరే నారాయణం

భాగవతా రామయణం

భవహరణం జీవనం ॥ భజో భజో ॥

భజో భజో గురు భజనం

అల్లా అక్బరు అన్నా హరే రాం రహీమ్ అన్నా

ప్రభో ఏసు నానక్ అన్నా ॥2॥

ప్రభోధనలు ఒకటేనన్నా ॥ భజో భజో ॥

భజో భజో గురుభజనం

బైబిల్ ఖురాన్ యైనా భగవంతుని గీత యైనా

పంచ మహా వేదాలైనా ॥2॥

పంచు సారమొకటేనన్నా ॥భజో భజో ॥

భజో భజో గురు భజనం

---

పొట్ట నింపుకో - పెట్టె నింపకు, సంగ్రహము పాపము.

--- వినోబాభావే.

గంగ యమున తరంగాల సంగమ మౌజావళొకటే
మందిర్ మసీద్ మక్కా ॥2॥
మనకు చూపు మార్గ మొకటే ॥భజో భజో ॥
భజో భజో గురు భజనం

(5) రాధే గొవింద కృష్ణ మురారి ॥2॥
జయ సాయి ముకుందా మురారీ ॥2॥
॥ రాధే గోవిందా ॥
నందా నందా రాధే గోవిందా ॥2॥
రాధే గోవిందా సాయి ముకుందా ॥2॥
సాయి ముకుందా మురారీ ॥రాధే గోవిందా॥
జయ సాయి ముకుందా మురారీ ॥నాందా నందా॥
॥రాధేగోవిందా॥

6. నంద నంద నంద నంద నందా
అనందా - నందా బాలుడా ॥నంద నంద॥
గోకులబాలుడా ॥ఆహా॥
గోపరిపాలుడా ॥ఓహో॥
రాధాలోలుడా ॥ఆహా॥
రాసవిహారుడా ॥ఓహో॥
రాధాలోలుడా రాసవిహారుడా ॥గోకులబాలుడా॥నందనంద॥
సుందర దేవుడా ॥ఆహా॥
బృందావనదేవుడా ॥ఓహో॥

పొరుగువారి కష్టాలను నీవిగా దలచి వారికి సాయపడుము.
--- చైతన్య ప్రభువు.

రేపల్లె గోపాలుడా ॥ఆహా॥
వేణూమాధువుడా ॥ఓహో॥
రేపల్లె గోపాలుడా వేణూ మాధవుడా ॥సుందర॥నంద నంద॥
గీత బోధ జేసినా ॥ఆహా॥
ద్రౌపదిని గాచినా ॥ఓహో॥
మీరాను బ్రోచిన ॥ఆహా॥
గోపికల దోచిన ॥ఓహో॥
మీరాను బ్రోచిన గోపికల దోచిన ॥గీతభోధ॥నంద నంద॥
అన్నుల మిన్నయ్య ॥ఆహా॥
వెన్నెల కృష్ణయ్య ॥ఓహో॥
చిన్నారి పొన్నయ్య ॥ఆహా॥
అన్నయ్య కన్నయ్య ॥ఓహో॥
చిన్నారి పొన్నయ్యా అన్నయ్యా కన్నయ్యా ॥అన్నుల ॥నంద నంద॥
అ...నందా బాలుడా - ఆహా నందా బాలుడా॥

8. హర హర హర హర ఓం సదాశివ
శివ శివ శివ శివ ఓం మహాదేవ ॥హర హర॥
గంగాధర హర నటన మనోహర
ప్రళయ భయంకర జయ శివ శంకర ॥గంగాధర॥
పరమ నిరంజన పాప వినాశ ॥హర హర హర హర॥
కైలాసాదిప కనక సభేశా
పన్నగ భూషణ పతిత పావన ॥కైలాసాదిన॥
చంద్రజటాధర హే శివ శంకర ॥హర హర హర హర॥

---

పోయేటప్పుడు వట్టిచేతులతో బోవుదవు గాన నేటి నుండి జాగ్రత్తపడు.
--- చిన్నరామదాసు.

ఓం మహాదేవా

నంద నంద నా గోవిందా - నవనీతచోర గోవిందా (2)
యశోద తనయ గోవిందా - యదుకుల దీపిక గోవిందా ॥నంద॥
పురాణ పురుషా గోవిందా - పుండరీకాక్ష గోవిందా
వేణు విలోల గోవిందా - విజయగోపాల గోవిందా
రాధా లోలా రుక్మిణి నాథ
రాధా లోలా గోవిందా - రుక్మిణి నాథ గోవిందా ॥హే నంద॥
దీన దయాళో గోవిందా - దీనోద్ధారణ గోవిందా
ఆపద్బాంధవ గోవిందా అనాథరక్షక గోవిందా
పాండురంగా పండరి నాథా
పాండురంగా గోవిందా పండరి నాథా (2) ॥హే నంద నందన॥
॥ గోవిందా గోవిందా - గోవిందా హరి గోవిందా॥
॥ గోవిందా హరి గోవిందా॥

## తన్మయ రవళి

1. లాలాల లల్లలాల - లలాలల్ల ల్లలాల లాల లాల (2)
ఘల్లు ఘల్లున రారా గోపాల క్రిష్ణ వడివడిగా అడుగులేస్తు
ఘల్లూ ఘల్లూ మంటూ వడి వడిగా అడుగులేస్తూ (2)
అమ్మా ఒడిలోకి రారా గోపాల క్రిష్ణా అమ్మ ఒడిలోకి రారా॥లాలాల॥
పెరుగు చిలికెదరారా గోపాల కృష్ణా వెన్నా పెట్టెద రారా
మనసు భాండము చేసి ప్రేమా కవ్వము చేసి (2)
అనురాగ రసదిలో మధియించి రారా ॥లాలాల॥
లాలా పోసెదరారా గోపాల కృష్ణా జోల పాడెదరారా

ప్రజలు కాకులవంటి వారు. వారి దూషణ భూషణ తిరస్కారాలను బట్టించుకొనకు.
--- అరవిందఘోష్

